


ఆంధ్రా, సీడెడ్, నైజామ్సు, ఉత్తర ఇండియాలకు డిస్ట్రిబ్యూటర్లు:

చమ్రియా టాకీ డిస్ట్రిబ్యూటర్స్,

విజయవాడ — గుంతకల్ — సికింద్రాబాద్

#### నమ్మిక! ...

అత్యుత్తమమైన టాయిలెట్ సబ్బులో
ఏమేమి మీరు కావలెనంటారో, అవన్నీ
మైసూరు శాండల్ సబ్బులో
కలవని నమ్మకముగా చెప్పగలము

ప్రతిచోట దొరుకును

గవర్నమెంటు సోప్ ఫ్యాక్టరీ
బెంగుళూరు

వెలువడినది ! వెలువడినది !

అపూర్వ సంగీత గ్రంథము

## గానకళాబోధిని

సంగీతమును ప్రారంభమునుండి రాగాలాపనలు, కల్పనస్వరములవరకు నేర్చుకొనువారికిని, లోయర్, హయ్యర్‌గ్రేడ్ పరీక్షలకు పోవు విద్యార్థులకు శాస్త్రము, ప్రాక్టికల్ గ్రాపులతోను పథకములతోను విపులముగా వ్రాయబడినది. 8½ × 5½ (డెమ్మీ 1/8) సైజులో 750 పేజీలుగల పుస్తకము. గ్లేజు కాగితముపై ముద్రింపబడిన పూర్తి క్యాలికో బైండు పుస్తకము వెల రు. 10/-లు. పోస్టేజి ప్రత్యేకము.

వలయువారు :

**బాలసరస్వతీ బుక్ డిపో**

పోస్టు బాక్సు నెం. 3, కర్నూలు

## చందమామ చందాదారులకు మనవి

చందమామ ప్రతినెల, గతనెలాఖరులోనే చందాదారులకు పోస్టు చేయబడును. కాపీ చేతనిఎడల మొదటి అరుతారీఖుల లోగా తమ పోస్టాఫీసులో విచారించి, మాకు తెలియజేయాలి. 10 వ తారీఖు తరువాత వచ్చు కంప్లైంట్లు అమోదింపబడవు. గడచినమాసములలో చేతలేదనే కంప్లైంట్లు గమనింపబడవు.

## సావరిన్ సూక్తులు



హల్వా గిట్టదు అరవిందానికి
ప్రతాపుకు పనికిరావు పిండివంటలు
కాని. ఉన్నదొక బలే తాయం—
అది అంటే అందరికీ ఇష్టం—
కమ్మని - తియ్యని
సావరిన్ స్వీట్స్
Sovereign
సావరిన్ స్వీట్స్




# పెళ్లిచేసి చూడు

నిర్వహణ...

**నాగిరెడ్డి...చక్రపాణి**

డైరెక్షన్

**ప్రసాద్**




# చందమామ

సంపాదకుడు: చక్రపాణి


దీపావళి అమావాస్య ఎంత ముఖ్యమైనదో ఆ వెంటనే వచ్చే కార్తీక శుద్ధ పున్నమి కూడా మనకు అంత ముఖ్యమైనదే. దీనికే త్రిపురపూర్ణిమ అని పేరు. ఐతే ఈ పూర్ణిమకు ఈ పేరు ఎలా వచ్చింది? అని ప్రశ్న. ఇందుకు ఒక చిత్రమైన కథ ఉన్నది: పూర్వకాలమందు త్రిపురాసురుడనే గొప్ప రాక్షసరాజు ఉండేవాడు. అతను నారదమహర్షి వల్ల శంకరుని కీర్తి విన్నాడు. విని, కైలాసపర్వతం మీదకి ఎత్తి వెళ్లాడు. శంకరునికీ త్రిపురాసురునికీ మధ్య మూడు రోజులపాటు ఘోర యుద్ధం జరిగింది. రాక్షస మూకను ఎంతోమందిని తునుమాడి శంకరుడు చివరకు త్రిపురాసురుణ్ణి సంహరించాడు. లోకానికి పీడాకరంగా వుండే రాక్షసరాజు సంహరింపబడిన ఆ పున్నమికి త్రిపురపూర్ణిమ అని పేరువచ్చింది. ఈవిధంగా జయించివచ్చిన శివుడికి దృష్టిదోష పరిహారార్థం, గౌరవసూచకంగా ఒక స్మారకచిహ్నం ఏర్పడింది. అదే ఈ నాటికికూడా అతి వైభవంగా జరుపబడుతూవున్న 'జ్వాలాతోరణ', మహోత్సవం. ఈ పున్నమినాడు ప్రతి శివాలయంలోనూ కొయ్యలు పాతి, వాటికి గడ్డి చుట్టబెట్టి, జ్వాలలు వెలిగించి ఆనందిస్తారు.


సంపుటి 9 :: నవంబర్ '51 :: సంచిక ౫

# దీపావళి

బేగంనగరపు జమీందారు ఒక
అలీనవాజను మహమ్మదీయుడు.
పేదసాదలకు, దిక్కులేని వా
రందరి కాతడు కడు ఆత్మీయుడు.

పోషిస్తాడు దీను లందరిని
కంటి రెప్పలా, బిడ్డలమాదిరి.
అందువల్లనే జనులందరికీ
అతడంటే బహు అభిమానం మరి.

ఆ ఊళ్ళోనే రామిశెట్టి అని
ఉన్నాడొక్క డబ్బుగల కోమటి.
అప్పుకోస మెప్పుడూ కాచుకొని
ఉంటా రెందరెందరో వాకిట.

చుట్టుపట్ల పల్లెలవారందరు
పేదలె ఐన, మోతుబరులైనా
అతనిముందు చెయిజాచకతప్పదు,
లొంగక తప్పదు ఎవ్వరికైనా.

అతనిచేతిలో చిక్కి ఎందరో
నాశనమై పొయ్యారప్పుడు గక.
ఇతరులటుంచి, అలీనవాజుకే
తప్పలేదు అతనిని ఋణమడుగక.

శెట్టి తప్పుబడిపోయా డాయన,
రాబడిలో సుంతైనా మిగులదు.
దీనయాచకుల కక్కడ తప్పక
ఒక దమ్మిడీ ఎక్కడా పిగలదు.

అప్పు పెరిగి వడ్డీపై వడ్డీ
జమీందారు కొంపకు ఎసరైనది.
తాకట్టులోనున్న ఆస్తంతా
ఒకవిధాన శెట్టికి పరమైనది.

'ఏమున్నది ? మన జమీందారుపని
ఇంతటితో సరి' అన్నా రందరు.
దిక్కులేని పక్షుల మైనామని
పేదలు, ఆశ్రితులెందుకు కుందరు ?

వచ్చిం దింతలోన దీపావళి,
వెలిగిం దింటింటా దీపావళి.
శ్యామశర్వరీలతాశాఖికల
విచ్చిందమల కనకకుసుమావళి.

బాణాసంచా కాల్చే పిల్లలు
ఎచటచూచినా వెలుగులు, రవ్వలు.
ప్రతి మొఖాన సంతోషపు కళలే,
ప్రతి ఇంట్లో మార్మ్రోగే నవ్వులు.

రచన:
"బైరాగి"

హయారూఢుడై జమీందారు తన
గ్రామంలో వేడుక చూదామని
వెడలినాడు, ఋణ ఘూలంగా తన
కే ఉత్సాహం లేనప్పటికిని.

సెట్టి ఇంటివైపునే మరలినా
అతను అలాగే వేడుక చూస్తూ.
అతనిని చూచి సెట్టి పరుగెత్తుక
వచ్చాడంగలు పెద్దవివేస్తూ.

'చాలా రోజులకిటు వచ్చా'రని
ఎంతో ఆప్యాయతతో అతనిని
తీసుకపోయా డింటిలోపలికి
చేతులు బలవంతాన పట్టుకొని.

సెట్టి గృహం దేదీప్యమానమై
వెలుగుతోంది వైభవ నిలయంగా.
జమీందారు కెన్నో మర్యాదలు
గావించాడు అతడు వినయంగా.

జమీందారు ఆశ్చర్యచకితుడై
పోయాడీ మర్యాద ఏమిటని.
అనుకొన్నాడిది అంతా బహుశా
డబ్బుమాట అడిగేందుకు ఎత్తని.

కొంతసేపటికి అతడు సెట్టిని
సెలవడిగా డిక నేపోతానని.
సెట్టి పడమటింట్లో కెళ్ళాడుం
డండిడిగో నేవస్తున్నానని.

లోపలనుంచి ఆత డేవేవో
కాగితాలు చేగొనివచ్చాడు.
దగ్గరమున్న దీపశిఖలోనే
వాటిని త్వరగా ముట్టించాడు.

'ఏమి పనయ్యా? అది నానోటని'
జమీందారుగా రరచేలోగా,
అంతా ఐపోయిందీ క్షణంలో
కాగితాలు బూడిదయైపోగా.

'ఋణవిముక్తులిక మీరలు. ఇదిగో
ఇదీ నా సత్యమైన దీపావళి'
అని పలికాడు సెట్టి తేజోమయ
మై వెలిగిందాతని ముఖమండలి.

కన్నులు చెమ్మగిల్లి 'యా అల్లా!'
అని నవాబు తలవంచాడప్పుడు.
ఇద్దరి హృదయాల్లో భగవంతుడు
ఒకే జ్యోతి వెలిగించాడప్పుడు.




ఒక యింటిముందు ఆరేళ్ల కుఱ్ఱవాడొకడు తల్లిప్రక్కన ఆడుకొంటూ వున్నాడు. వానితో ఉండే నేస్తం ఒక ఎనిమిదేళ్ల పిల్లవాడుకూడా ఆడుకొంటున్నాడు. వాళ్లు అలా ఆడుకొంటూవుండగా తల్లి యింటిలోపలికి వెళ్లి రెండు రొట్టెముక్కలు తీసుకవచ్చింది.

"నాయనా!-ఈ ముక్క నువు తీసుకో, అది నీ నేస్తానికివ్వు" అంటూ, పెద్ద ముక్క కొడుక్కి, చిన్నముక్క తోడి కుఱ్ఱవాడికి వుద్దేశించి ఇచ్చింది.

ఐతే, ఆమె అనుకున్నట్లు గాక, అతడు పెద్దముక్క నేస్తానికిచ్చి, చిన్నముక్క తను నోట్లో వేసుకున్నాడు. ఇది చూచి తల్లి ఆశ్చర్యపడింది.

'ఇదేమిట్రా నాయనా!—ఇలా చేశావేమిటి? పెద్దముక్క నిన్ను తీసికోమంటే ఆ అబ్బాయికి ఇచ్చావేమిటి?' అని అడిగింది. అందుకు ఆ కుఱ్ఱవాడు 'అమ్మా! ఈ పిల్లవాడిని నా అన్నగా చూచుకోవాలని చెబితివే వెనక, జ్ఞాపకం లేదా! న్యాయ ప్రకారం మరి, పెద్దవానికి పెద్దముక్క, చిన్నవానికి చిన్నముక్కే కద వస్తుంది? ఇందులో ఆశ్చర్యపడవలసిన విషయమేమున్నది?' అని ఎదురుప్రశ్న వేశాడు.

ఈ మాటలకు ఆమె చాలా సంతోషించింది. అంతటి చిన్నవయసులోనే న్యాయాన్యాయ విచక్షణ జ్ఞానం కలగటం, అన్నగా ఎంచుకున్న పెద్దవానికి పెద్ద రొట్టెముక్క ఇచ్చి, తను చిన్నముక్క తీసుకోవటం, తల్లికి అమితమైన ఆనందాన్ని కలిగించింది.

ఈవిధంగా తల్లిని సంతోషపెట్టి ఆమె దీవనపొందిన ఆ పిల్లవాడే, మొదట అధ్యాపకుడుగావుండి, తరవాత బొంబాయి హైకోర్టులో జడ్జీపదవి నలంకరించి, అద్భుతమయినటువంటీ అపూర్వమయినటువంటీ తీర్పులు దిద్దిన ప్రతిభాశాలి, న్యాయమూర్తి మహాదేవ గోవింద రేనడే.




దసరా పండుగలలో ఒక చిట్టితల్లి చక్కటి బొమ్మలకొలువు పెట్టుకుంది. ఆ కొలువులో పుదుచ్చేరిబొమ్మలు, నక్కపల్లిబొమ్మలు, కొండపల్లిబొమ్మలు, చందనపుబొమ్మలు, గాజుబొమ్మలు, సెల్యులాయిడ్‌బొమ్మలు, ప్లాస్టిక్కుబొమ్మలు, రబ్బరుబొమ్మలు, రకరకాల బొమ్మలన్నీ ఉన్నాయి. దేవుళ్ల బొమ్మలున్నాయి. గాంధీ, నెహ్రూ బొమ్మలున్నాయి. పక్షుల బొమ్మలున్నాయి. జంతువుల బొమ్మలున్నాయి. కొలువులో మెట్టుమీద మెట్టు పది మెట్లున్నాయి. రెండో మెట్టుమీద అన్నీ జంతువులబొమ్మలే.

చిట్టితల్లి అమ్మ పండగ పదిరోజులూ ఏవో అప్పచ్చులు చేసేది. అష్టమినాడు మిఠాయి చేసింది. చిట్టితల్లికి మిఠాయి అంటే మహా ఇష్టం. పేరంటానికి వచ్చిన వాళ్లకి ఇచ్చినప్పుడల్లా తనుకూడా ఒక ఉండ గుటుకాయి స్వాహా చేస్తూండేది. తినగలిగినన్ని తిని, ఇంక తినలేక ఒక ఉండ మిగిలితే దాన్ని రాత్రి బొమ్మల కొలువులో జంతువులున్న మెట్టుమీద దాచుకుంది. తెలియకుండానే ఆమెకు నిద్రపట్టేసింది,

చిట్టితల్లితోబాటు బొమ్మలుకూడా నిద్రపోయాయి గాని, ఒక్క గంటసేపటికల్లా అవిలేచేశాయి! లేచేసరికి, అంతకుముందు అక్కడ చిట్టి దాచుకున్న మిఠాయి ఉండ ఏమైందో గాని, కనపడలేదు.

ఆ ఉండ పోయినట్లు కొయ్యగుఱ్ఱమే మొదట కనిపెట్టింది. కనిపెట్టి, గాజుగాడిదతో 'ఎంతపని తమ్ముడూ! మన చిట్టితల్లి దాచుకున్న మిఠాయుండ కనపడలేదు సుమా!' అన్నది.

'ఎంత మాటన్నావు! గడ్డీ గాదం తిని పొట్టపోసుకునే నేను మిఠాయికి ఆశపడతానా? ఇంతకీ మన చిట్టితల్లి దాచుకున్న

యం. లక్ష్మి - మదరాసు



ఉండ తినేస్తానా? నే నేపాపం ఎరగను అన్నయ్యా!' అంది గాడిద.

'ఏం పిల్లీ? నువ్వేమంటావ్?' అంది గుఱ్ఱం. అందుకు గడ్డపిల్లి 'శివశివ! ఏ పాలో, మీగడో ఐతే కక్కుర్తి పడతానే గాని, మనల్ని నమ్మి నిద్రపోతున్న చిట్టితల్లి మిఠాయి కాజేస్తానా?' అంది.

అడక్కుండానే రబ్బరు ఎలుక ముందు కొచ్చి 'చిట్టితల్లికి ద్రోహంతలచిన దుర్మార్గు లెవరోగాని, తెలుస్తే పుటుక్కున తోకకొరికి మూడుముక్కలు చేసేద్దును!' అంది.

దూదికుందేలు మట్టితోడేలును అనుమానించింది. ఆ సంగతి కనిపెట్టి తోడేలు, 'నాకు ఆకలి ఎక్కువ అన్నమాట నిజమే. కాని ఈ మిఠాయి నేను ముట్టుకోలేదు. ఏమంటే ఈ కాస్తా నాకు ఏ మూలకి? విధం చెడ్డా ఫలం దక్కాలన్నట్లు కడుపు నిండని ద్రోహం తలపెడతానా?' అంది.

"ఏమండీ రాజా, మీరేమైనా...?" అని మృగాలన్నీ పింగాణీసింహంవైపు చూశాయి.

'ఎంత మూర్ఖులర్రా మీరు? అవసరమైతే ఏనుగు కుంభస్థలాన్ని బద్దలగొట్టి తింటానుగాని మన చిట్టితల్లి దాచుకున్న మిఠాయి దొంగిలించేటంత నీచుణ్ణానేను?' అని ఒక్కమాటు గర్జించింది సింహం.

"ఆంజనేయులవారి వంశంలో పుట్టి, నేను దొంగతనం చేస్తానా?' అంది కోతి.

'ఆ ఆంజనేయులవారి స్నేహితుడైన జాంబవంతుడు మా కులపెద్ద అయి వుండగా నేను దొంగిలిస్తానా?' అనిచెప్పి తప్పుకుంది ఎలుగుబంటి.

ఇలాగ ఎవరికి వారు 'మేం కాదంటే మేం కా'దనేసరికి గుఱ్ఱం గాడిదతో, 'ఏం తమ్ముడూ, దొంగ ఎవడో మనలోనే ఉండాలి. వాణ్ణి కనుక్కోడం ఎలాగో ఆలోచించు' అంది. 'ఆలోచించటానికి నా బుద్ధి అంత గొప్పది కాదు. అటువంటి

సామర్థ్యం మనలో ఒక్క నక్కబావకే ఉంది' అన్నది గాడిద.

నక్క ఇదివిని 'సామర్థ్యానికేముంది ఇందులో. అంతగా తెలుసుకోవాలనిఉంటే దొంగను ఇట్టే పట్టేస్తాను!' అంది.

'చెప్పు, చెప్పు' అన్నాయి జంతువులన్నీ.

'మీరంతా ఒక్కమాటు అటు వైపు తిరిగి కళ్లు మూసుకోండి' అంది నక్క. అవి అటుతిరిగి కళ్లుమూసుకున్నాయి.

అవి కళ్లు మూసి తెరిచేలోగా నక్క, కొలువులో ఉన్న గంధపుగిన్నెలో తన తుచ్ఛతోక ముంచి తీసి గప్‌చిప్‌గా ఏమీ ఎరగనట్లు నిలబడింది. నిలబడి తక్కిన జంతువులతో 'ఇంక మీరు ఇటు తిరగ వచ్చు. ఒక్కొక్కళ్లే వచ్చి నాతోక పట్టుకు లాగండి. దొంగఎవడో చెప్పుతాను' అంది.

'సెబాష్! బాగుందీపద్ధతి!' అనుకున్నాయి జంతువులు. గుఱ్ఱం, గాడిద, సింహం, ఏనుగా, కోతీ, కొండముచ్చూ— ఈ మొదలైన జంతువులన్నీ ఒక్కొక్కటే వచ్చి నక్కతోక లాగి వెళ్లేయి.

'అందరూ లాగటం ఐందా?' అని నక్క అడిగింది. 'ఐంది' అంటూ, జంతువులన్నీ 'ఎవరో తెలిసిందా?' అని అడిగాయి.



'తొందరపడకండి. ఒక్కొక్కళ్లే ఈ మాటు నాముందునుంచి నడిచి చేతులు ఒకమాటు చూపి పోండి!' అన్నది నక్క.

'సరే' అని ఒకొక్క జంతువే వెళ్లి, నక్కకి తమ చేతులు చూపించాయి. అప్పుడే అవి తమచేతుల్ని తామే ఒకమారు చూసుకున్నాయి.

'ఇదేమిటి? మా చేతులు ఇలాగ పచ్చగా ఉన్నాయి? సువాసన కూడా వేస్తోందే!' అని ఆశ్చర్యపోయాయి. నక్క వాటిచేతులుచూచి గంధం ఉన్న జంతువు నల్లా, 'నువు దొంగవు కావు' అని చెప్పి పంపేసింది.

అన్ని జంతువులు అలా దాటివెళ్లగా, ఆఖరికి ఎలుక ఒక్కటీ మిగిలింది.

ఎలుకకూడా చేతులు చూపించి దాటుకు పోబోతూంటే నక్క, 'ఆగు! నువ్వే దొంగవి!' అని కళ్లు ఎర్రచేసి అరిచింది.

ఎలుక పారిపోబోయిందిగాని పిల్లి దాన్ని పట్టేసి కూచోబెట్టి, 'కదిలేవంటే జాగర్త!—ఏమనుకున్నావో' అంది.

గుఱ్ఱం ముందుకొచ్చి, 'నువ్వేనా చిట్టి తల్లి మిఠాయి మింగేస్త!' అని కోపంగా సకిలించేసరికి, 'నే-నే' అని ఎలుక మెల్లిగా కీచుకీచుమంది.

కోతి కిచకిచలాడుతో ముందుకొచ్చి, 'ఎంత నంగనాచివే! దొంగ ఎవరో తెలుస్తే దాని తోక పుటుక్కున కొరుకుతానన్నావే!' అంటూ ఎలుక నోట్లో దాని తోకనే కుక్కబోయింది బలవంతంగా.

సింహం అడ్డువచ్చి, 'తప్పుకో! శిక్ష విధించవలసింది నేను!' అని కోతిని ఆజ్ఞాపించింది. నక్కకేసి తిరిగి, 'మంత్రి పుంగవా! ఈ మూషికాధముడు చోరుడు అని నీకు ఎలాతెలిసింది?' అని అడిగింది.

నక్క నవ్వుతో 'ప్రభూ, నా తోక లాగినప్పుడు దొంగ ఎవరో తెలిసిపోతుందని అన్నాను గనక ఈ ఎలుక భయంకొద్దీ నా తోక తాకటమే మానేసింది! అందుచేతనే మీ అందరికీ అంటుకున్న గంధం దీని చేతులకి అంటుకోలేదు. గంధం లేకపోవటంతోనే పట్టేశాను!' అంది.

నక్క తెలివికి సింహం ఎంతగానో మెచ్చుకుంది.

ఆ తరువాత పిల్లితో 'పిల్లీ, మన చిట్టి తల్లికి ద్రోహం తలపెట్టిన ఈ కీచుగాడికి కొలువులో ఉండే అర్హతలేదు. వాడిని పై మెట్టుకు తీసుకుపోయి, అక్కడనుంచి కొలువువెనకాల అగాధంలోకి తోసివెయ్యి!' అన్నది. వెంటనే పిల్లి ఆ పనిచేసింది. ఎలుక కలుగులోకి దూరిపోయింది.






## 17

[ఎలాగో గొర్రెపువాడిని కలుసుకున్నాడు ఉదయనుడు. అంతలో రాక్షసుడు రాగా ఒక బానలో దూరాడు. అక్కడ ప్రతాపుడు—తనను పెళ్లాడుమని రాకుమార్తెలను నిర్బంధింపసాగాడు. రాక్షసుడు ఉదయనుణ్ణి పట్టితెమ్మని నిశీధుడిని పంపాడు తరువాత—]

ఉదయనుడిని వెతికిపట్టి, అతనివద్దనున్న భస్మాలూ, అంజనాలూ తెచ్చి తనకు వప్ప చెప్పమని రాక్షసుడు నిశీధుడిని వసిలి పెట్టి పంపేటప్పుడు అదివరకు రాకుమార్తెలను చేసినట్టుగానే అతనినికూడా మూగి చేసి మరీ వదిలాడు.

నిశీధుడు పోయిపోయి చివరకు మాళవ దేశం చేరుకున్నాడు. ఉదయనుడికీ నిశీధుడికీ ఏమాత్రమూ తేడా లేక, ఇద్దరూ అచ్చుమచ్చు ఒకే పోలికగా వుంటారు కనుక అతనే ఉదయను డనుకొని అక్కడి ప్రజలు ఎంతో ఆదరంతో అతనిని తమ రాజువద్దకు తీసుకువెళ్లారు.

ప్రతాపుడుకూడా ఆ వచ్చినది ఉదయనుడే ననుకున్నాడు. తను భస్మాలూ అంజనాలూ కాజేసినందుకుగాను కక్షగట్టి వాటిని తిరిగి లాగుకోవాలనే వుద్దేశంతో వచ్చాడను కొని మనసులో భయపడ్డాడు. ఐతే పైకి మాత్రం ఏమీ ఎరుగనట్లు నటించి, "ఏమోయ్! నీవు వెళ్లిన పని కాయా, పండా?" అని ఆప్యాయంతో ప్రశ్నించాడు.

ఆ దేశానికి తను అంతకుమునుపు ఎన్నడూ రాకపోయినా, అక్కడి ప్రజలూ, ఆ రాజూ తనని యిలా ఎందుకు ఆదరిస్తూ వున్నారో నిశీధుడికి ఏమీ బోధపడింది కాదు. పోనీ "మీరు ఎవరిని చూచి



ఎవరనుకుంటున్నారో" అని. అందామంటే తనకి మూగతనం సంప్రాప్తమయ్యే! ఏమిటి చెయ్యటమా అని ఆలోచించి చివరకు సంజ్ఞవల్ల తను మూగవాడినంటూ రాజుకి తెలియజెప్పాడు.

రాజుకి ఆశ్చర్యంవేసింది. "అదేమిటి ఉదయనా? నీవు క్రిందటిమారు వెళ్ళేటప్పుడు సలక్షణంగా వెళ్ళితివికదా! యిప్పుడు మూగవాణ్ణి అయానంటావేమిటి?" అన్నాడు విస్తుపోతూ.

'ఉదయనా' అని ఎప్పుడైతే రాజు అన్నాడో, నిశీధుడికి అంతా అర్థమయిపోయింది. వ్రాతపరికరాలు తెప్పించుమని సంజ్ఞచేశాడు. అవి రాగానే, తను ఉదయనుణ్ణి కాననీ, ఉదయనుడు తన సోదరుడేననీ, ఉదయనుడి జాడ తెలియకనే తను యిలా బయలుదేరి వచ్చాననీ, తన సోదరుడు ఎక్కడున్నదీ తెలియజేస్తే సంతోషిస్తాననీ వ్రాశాడు.

రాజుకి అంతా అర్థమైంది. తన బండారం ఎక్కడ బయటపడుతుందోనని భయపడిపోయాడు. ఒక్క ముక్కలో చెప్పాలంటే, రాజుకు పచ్చివెలక్కాయ గొంతున పడ్డట్టయింది. "ఎలాగో ఉదయనుడిని మోసపుచ్చి భస్మాలూ, అంజనాలూ కాజేసి వాడి పీడ వదిలించుకున్నానుకదా అని సంతోషిస్తే, మళ్లీ వీడు తయారయాడే! ఉదయనుడి వివరాలు నాకు తెలిసినట్టు వీడికి చెపితే ప్రమాదం కోరి తెచ్చుకున్నట్టవుతుంది" అనుకున్నాడు.

ఇప్పుడు రాజుకి మరో దుర్బుద్ధిపుట్టింది. "ఉదయనుడెలాగో ఈపాటికి రాక్షసుడి చేతిలో చనిపోయేవుంటాడు. వీడినికూడా కడతేర్చానంటే ఇక మిగిలిందల్లా మూడోవాడు. వాడూ ఎప్పుడో నా చేతిలో చిక్కపోగలడు. అప్పుడు యిక రాకుమార్తెలకు వేరే మార్గం ఉండదు" అనుకున్నాడు.



ఇలా అనుకుని, నిశీధుడితో "అబ్బాయ్! మీ సోదరుడు యిక్కడకు వచ్చినమాట అయితే నిజమే. కాని అతను యిక్కడ ఒక్క పూట మాత్రమే వున్నాడు. ఆతర్వాత అతని దారిని అతను వెళ్లిపోయాడు. ఎక్కడికి వెళ్లాడో నాకూ తెలియదు. అయితే, ఈ కష్టదశలో నీకు నేను చెయ్యగలిగిన సహాయం అంతా చేస్తాను. ఉదయనుడిని వెతకటంలో నీకు సహాయం కావాలంటే నా సేవకులలో ఒకరిద్దర్ని వెంటపంపు తాను" అన్నాడు.



అంతే చాలునన్నట్లుగా నిశీధుడు తల వంచి నమస్కరించాడు. ఆవెంటనే రాజు తన మంత్రిని రహస్యంగా పిలిచి "ఈ కుర్రవాడి వెంట మన భటులనిద్దర్ని పంపించు. ఊరివెలుపలకు చేరుకోగానే మూడో కంటికి తెలియకుండా సఫాచేసి వెయ్యకుమ" అని చెప్పాడు.

మంత్రి నిశ్చేష్టుడయ్యాడు. కాని రాజాజ్ఞ పాటించకపోతే ముందు తన తల ఎగిరిపోతుందే! చేసేదిలేక రాజాజ్ఞప్రకారం యిద్దరు భటులను తోడిచ్చి నిశీధుడిని సాగనంపాడు.

* * *

అక్కడ ఉదయనుడి సంగతి — యింక రెండు రోజులలో రాక్షసుడు తిరిగి వస్తాడు. ఈలోగా, వాడికి అనుమానం కలగకుండా ఏదో ఒకటి చెయ్యాలి. గెడ్డపువాడితో సంప్రతించినమీదట వాడు "నన్ను ఎప్పటిలా వ్రేలాడదియ్యి. నువ్వు మాత్రం వాడు వచ్చేటప్పటికి ఏదో ఒకమూల జాగ్రత్తగా నక్కివుండు. అదును చూచుకుని బైటికి జారుకో. ఆ తరువాత తక్కిన కాపలా వాళ్లతోపాటుకలిసి నువ్వూ కాపలాకుపోయి నీ సోదరులు ఏమయ్యారో కనిపెట్టు. ఇప్పుడు వెంటనే చెయ్యవలసింది యిదే" అన్నాడు గెడ్డపువాడు.






"మరి వాడు వచ్చి, మూడో బాన ఏదీ అని అడుగుతాడేమో ఒకవేళ?" అన్నాడు ఉదయనుడు.

"దానికి ఒక ఉపాయం ఉందిలే. మనం పోగుచేసిన పెంకులన్నీ మళ్లీ తెచ్చి యిక్కడ పోద్దాం" అన్నాడు గెడ్డపువాడు.

అదేప్రకారం పెంకులు తెచ్చిపోశారు. రాక్షసుడు యిక రేపు వస్తాడనగా ఉదయనుడు గెడ్డపువాడిని ఎప్పటిలా వ్రేలాడ తీసి తను ఒకమారుమూల నక్కిఉన్నాడు.

అనుకున్నట్టే మర్నాడు రాక్షసుడు వచ్చాడు తలుపు తెరుస్తూనే మూడవ బాన ముక్కలై వుండటం చూసి, "ఇది ఎవరి పనిరా" అని పెడబొబ్బలు పెట్టుకుంటూ గెడ్డపువాడిదగ్గిరికి వచ్చాడు.

గెడ్డపువాడు ఏమీ తొణకకుండా "నేనే బాబయ్యా! వేలాడి వేలాడి వినుగుపుట్టి, కాసేపు ఊగుదామనిపించి ఊగటం మొదలెట్టానండి. నాకు తెలియకుండానే బ్రహ్మాండంగా ఊగానండి. ఆ వూపులో నేను వెళ్లి ఆ బానకు కొట్టుకున్నానండి. అది కాస్తా క్రిందపడి యిలా ముక్కలై పోయిందండి. మన్నించాలి!" అన్నాడు.

"అఘోరించలేకపోయావ్!" అని విసుక్కున్నాడు రాక్షసుడు.

ఈ గొడవ జరుగుతున్నప్పుడే ఉదయనుడు చల్లగా జారుకున్నాడు. పగటికావలా జట్టువాళ్లు కొలనుకు బయలుదేరుతుంటే, వాళ్లతోపాటు తనూ వెళ్ళాడు. ఆరోజువ మాటలసందర్భంలో తెలుసుకున్నాడు— తనను వెతికి పట్టటానికి నిశీధుడు రాక్షసుడిచేత పంపబడ్డట్టూ, సంధ్య ఒక్కడే కొలనులో వున్నట్టూను.

ఇది తెలిసేసరికి ఉదయనుడు తెల్లబోయాడు. తను ఇక్కడేవుంటే, తనకోసం నిశీధుడు ఎక్కడని వెతికి పట్టగలడు? అతను ఎక్కడికి పోయినట్టు? ఎలాగయినా

అతనిని కలుసుకోగలిగితే బాగుండును. కాని అదెలా సాధ్యం? ఏమీ పాలుపోయిం దికాదు. అందుకు ఏదైనా ఉపాయంచెబితే గెడ్డపువాడే చెప్పాలి అనుకున్నాడు.

అదేప్రకారం ఆసాయంత్రం తిరిగి పాతాళగృహం చేరుకోగానే ఒక్కపరుగున గెడ్డపువాడిగదిదగ్గరికి వెళ్ళాడు. కాని చిత్రమేమిటో! గదితలుపులు బార్లగా తీసి వున్నై. గెడ్డపువాడూ లేడు, రాక్షసుడూ లేడు. దూలానికి కట్టిన త్రాడుమాత్రం వ్రేలాడుతూ వున్నది.




ఈదృశ్యం కంటబడగానే ఉదయనుడు నిలువునా నీరైపోయాడు. "నా ఆశలన్నీ గెడ్డపువాడిమీద పెట్టుకునివస్తే యిలా అయిందేమిటి? వాడు ఏమైనట్టు? ఈ వాలకమంతా చూస్తే, రాక్షసుడు గెడ్డపువాడి మీద మండిపడివున్నట్టు తోస్తుంది. గెడ్డపు వాడిని హతమార్చలేదుకదా కొంపదీసి? లేదు. అలా జరిగివుండటానికి వీల్లేదు. గెడ్డపువాడు ఏదోతంత్రంచేసి వాడిని మాయ పుచ్చగలడు. ఇక్కడే మరి ఏగదిలోనన్నా బంధింపబడి వుండవచ్చు" అనుకుంటూ అక్కడి గదులన్నీ వరసగా గాలించటం మొదలుపెట్టాడు.

అలా వెతుకుతుండగా ఉదయనుడి కాలు నేలమీద ఒక మీటపైన పడింది. అలా పడగానే ఎదురుగా వున్నగోడ రెండుగా విచ్చి దారి ఏర్పడింది. ఉదయనుడు ముందుకు ఒక్క అడుగు వేశాడు. అంతే రెండవ అడుగు పడనేలేదు. ఎందుచేత నంటే: తన కెదురుగా ఒక పెద్ద బంగారు ద్వారం కనుపించింది. దానికి పైనుంచి భీకరమైన మూడు సర్పాలు బ్రహ్మాండంగా బుసలుకొడుతున్నై. గెడ్డపువాడు అలోపల వున్నాడేమో? కాని సర్పాల్ని తప్పించుకు వెళ్లడమెలా? తీవ్రంగా ఆలోచించాడు. మెరుపులా ఒక ఉపాయం తట్టింది.



గెడ్డపువాడి గదిలో వున్న బాన ఒకటి నెమ్మదిగా దొర్లించుకు వచ్చాడు. బానలో దూరి మూతవేసుకుని ఒక్క విసురుతో బంగారుద్వారంలోంచి దూసుకుపోయాడు. మూత తొలగించి తొంగిచూచాడు. మరేం ప్రమాదం లేదనితోచి బైటపడ్డాడు.

ఆ గది చూచేసరికి ఉదయనుడి కళ్లు మిరుమిట్లుగొలిపినై. గది గోడలూ, నేలా అంతా బంగారుమయమే. క్షణంసేపు విస్తు పోతూ అలాగే గదిఅంతా పరికిస్తూ వుండి పోయాడు. కాని అంతలోనే తను వచ్చిన పని గుర్తుకు వచ్చింది. గెడ్డపువాడికోసం మూలమూలలా వెతకసాగాడు. తను

పించలేదు. కాని అలా వెతుకుతుంటగానే అక్కడున్న మరో మీటపైన కాలుపడి, ఎదురుగావున్న గోడ యిదివరకటిలాగానే చీలి దారియిచ్చింది. క్రిందటిమారు జరిగి నట్టుగానే ఏదో చిత్రం జరుగుతుందనుకుంటూ అడుగు ముందుకు వేశాడు.

క్రిందటిమారులాగానే ఈసారికూడా ఒక పెద్ద ద్వారం కనుపించింది. అయితే యిది వెండిద్వారం. దీనికి ఆరు సర్పాలు వ్రేలాడుతున్నై. ఒకసారి ఉపాయం కని పెట్టివున్నవాడే కనుక ఈమాటుకూడా బానలో దూరి ఈ ద్వారంలోంచికూడా దూసుకుపోయాడు.

కాని దురదృష్టవశాత్తు, ఈసారి బాన విసురుగా దొర్లుకుంటూ పోయి ఆ వెండి గదిగోడకి కొట్టుకుని ముక్కముక్కలై పోయింది. దానితో ఉదయనుడు బైట పడ్డాడు. గదిగోడలూ, నేలా అంతా వెండిమయమే. అయితే ఆ వింత చూస్తూ విస్తు పోతూ వుండిపోక ముందుకు పోయే మార్గమేమిటా అని వెతికాడు. కాని యిక్కడ మీట ఏదీ కనుపించలేదు. కాని గది పైకప్పునుంచి వెండి గొలుసు ఒకటి వ్రేలాడుతూ వున్నది. ఒక్క ఎగురు ఎగిరి

అది పట్టుకు లాగాడు. ఎదురుగావున్న వెండిగోడ చల్లగా పైకి లేచిపోయి దారి ఏర్పడింది. లోపలకు అడుగు పెట్టాడు. ఈసారికూడా ఒక పెద్ద ద్వారం కనుపించింది. ఐతే యిది రత్నాలతో పొదగబడిన ద్వారం. దీనిపైనుంచి పన్నెండు సర్పాలు వ్రేలాడుతున్నై.

ఇంతవరకూ బావిలో దూరి ఎలాగో బంగారు ద్వారం, వెండి ద్వారం దాటు కొచ్చాడు. ఆ బావ కాస్తా పగిలిపోయిందాయే! ఏమిటి మార్గం? ఇలాంటివి యింకా ఎన్ని ద్వారాలు దాటాలో, యింకా ఎన్ని ప్రమాదాలు ఎదుర్కోవలసివుంటుందో? పోనీ యింతటితో వెనక్కి మరలి పోదామన్నా, మళ్లీ వెండి ద్వారందగ్గిర ఆరు సర్పాలూ, బంగారు ద్వారందగ్గిర మూడు సర్పాలూ తప్పించుకుని పోవటం ఎట్లా? పోనీ, తెగించి రత్నాల ద్వారం ప్రవేశించేందుకు ప్రయత్నిద్దామా అంటే ఒకటి కాదు, రెండు కాదు పన్నెండు సర్పాలనుంచి తప్పించుకోవాలాయె. ఎలా గంతం గడపటం?

"ఏమిటా దారి, భగవంతుడా" అనుకుంటూ ఆ రత్నాలగదిలోనే కూర్చుని




తీవ్రంగా ఆలోచించసాగాడు. కాని ఎంత ఆలోచించినా, ప్రాణాలకు తెగించి లోపలికి పోవటం తప్ప వేరే మార్గం కనుపించ లేదు. అంటే, ముందు దానికి వ్రేలాడుతున్న సర్పాల్ని సంహరించాలి.

మారు ఆలోచన లేకుండా ఉదయనుడు సర్రున కత్తిదూసి వ్రేలాడుతున్న ఆ సర్పాలపైన ఒక్క వేటు వేశాడు. ఆ దెబ్బతో ఆరు సర్పాలతలలు తెగిపడినై. మరోదెబ్బ తీశాడు. ఈసారి అయిదింటి తలలెగిరి పోయినై. ఒక్క సర్పం మిగిలింది. దానికీ తెగటార్చితే ఇక నిర్భయంగా లోపల ప్రవేశించవచ్చుకద.

ఉదయనుడు గురిచూచి కత్తి విసిరాడు. కాని సర్పం ఈసారి దెబ్బ తప్పించుకొని ఒక్క విసురులో వచ్చి ఉదయనుడి చేతి మీద కాటువేసింది. చేతిలోని కత్తి కాస్తా క్రింద పడింది.

విషం ఎక్కిపోతున్నది ఉదయనుడికి. ముచ్చెమటలు పోసినై. ఆలస్యమైతే ప్రాణానికే మోసం. ఉదయనుడు, కత్తి తీసుకుని ఒక్క వ్రేటుతో చెయ్యి నరికివేసుకున్నాడు. మరోదెబ్బతో ఆ సర్పాన్నికూడా ఖండించివేశాడు. మరుక్షణమే స్పృహ తప్పి పడిపోయాడు.

ఆలా ఎంతసేపు పడిఉన్నాడో తెలియదు. తిరిగి స్పృహ వచ్చి చూచేసరికి తెగిన చేతినుండి కారిన రక్తం మడుగు కట్టివుంది. ఇంకా రక్తం కారుతూనే వుంది. ఏమిటి చెయ్యటం భరించటం తప్ప. బాధపడుతోనే ముందుకుసాగాడు.

కొంతదూరం వెళ్ళేసరికి ఒక పెద్ద గుహ కనుపించింది. అందులో రాక్షసుడు కొలుస్తూవున్న దేవీవిగ్రహం కనుపించింది. దేవి మెడని నూటఒక్క పుర్రెలు వేలాడుతున్నై. నోటిలోనుంచి భుగభుగమంటూ అగ్ని జ్వాలలు వస్తున్నై. కళ్లల్లోనుంచి తీవ్రమైన వెలుగు, వెలుగులోనించి కిరణాలు వస్తున్నై. దేవి చెయ్యి చాచివున్నది. అరచేతిపైన ఒక గద్ద నిలబడివున్నది. దేవి విగ్రహమూ, ఆ వాతావరణమూ అంతా చాలా భయంకరంగా వున్నది.

అయినా ఉదయనుడు చలించలేదు. ధైర్యం కూడదీసుకుని విగ్రహం వైపుకి నడిచాడు. నాలుగడుగులు వేశాడో లేదో దేవి నొసటినుండి బ్రహ్మాండమైన పొగ వెలువడి గుహంతా ఒక్కసారిగా కమ్ముకున్నది. ఆ పొగలో ఉదయనుడు ఉక్కిరిబిక్కిరైనాడు. (ఇంకా వుంది)






అప్పటికి నాకు పధ్నాలుగేళ్లకంటే ఎక్షువ ఉండవు. మా అన్నయ్య నాకంటె నాలుగేళ్లు పెద్ద. పడవలో తినటానికని మా అమ్మమ్మ కాల్చి ఇచ్చిన మినపరొట్టె మూటతో మేం యిద్దరం అమలాపురంలో రహదారీ బోటు ఎక్కి రాజమహేంద్రవరం వెడుతున్నాం. పడవ ముక్కామల చేరుతున్నాక అక్కడ కొన్ని బస్తాలూ, కొందరు మనుషులూ పడవలోకి ఎక్కేరు. వాళ్లలో పొడుగ్గా సన్నటి ఒకాయన ఉన్నాడు.

ఆయన్ని చూడటంతోనే పడవ హాల్లో ఉన్న కొందరు 'దయచెయ్యండి పేర్రాజు గారూ!' అంటూ ఆహ్వానించారు.

'బలే తమాషా మనిషి! చిత్రవిచిత్రమైన కథ లెన్నయినా వచ్చు ఈయనకి!' అన్నాడు నాపక్కనున్న మీసాలకాపు. అని 'పేర్రాజుగారూ, మంచి అద్భుతమైన విషయం ఏదైనా చెప్పండి' అని కోరేడు.

ఆయన 'అలాగే'నని, సర్దుకుని కూచున్నాక ఇలాగ ప్రారంభించాడు:

"ఇది చాలా అద్భుతమైన విషయం. వినండి. నేను అప్పుడు అమెరికాలో ఉన్నాను. అమెరికాలో ఇళ్ల అద్దెలు మన దేశంలోకన్న చాలా ఎక్కువ గనకనే నేను పెద్ద భవంతులవైపు పోక ఒక పాతయింట్లో గది ఒకటి తక్కువబాడుగకు కుదుర్చుకుని అందులో ప్రవేశించాను.

"అక్కడకు వెళ్లిన కొత్తలో నీరూ, ఆహారం నాకు కొత్తవేసి ఒంట్లో అనారోగ్యం కలిగించాయి. జ్వరం వచ్చి, ఒక పదిహేను రోజులదాకా మంచంమీదే ఉండి పోవలసి వచ్చింది నేను. ఆ పదిహేను రోజుల్లోనూ నాకు ప్రపంచమంతా ఆ నాలుగు గోడల మధ్యనే. ఆ ఇంటికి ఏనాడు వేశారో వెల్ల! గోడలకు అక్కడక్కడ పెచ్చులు పెచ్చులుగా ఊడిపోయి రకరకాల ఆకారాలు

యస్. మాలతి - గుంటూరు.



ఏర్పడ్డాయి. వాటిల్లో ఒక ఆకారం సరిగా ఒక మనిషికిమల్లే కనపడింది!

"పరికించి చూస్తినిగదా బెల్లు ఊడిపోయిన అచోటు, మనిషికిమల్లే ఉండటమే కాకుండా నేను మా ఊళ్లో చిన్నప్పట్నుంచీ ఎరిగున్న కోటీశ్వరుడు కోటయ్యశెట్టినిపోలి ఉంది. చక్కా లంకగుమ్మడికాయంత బొజ్జ అతనిది. బాగా సోలడు పొడుంపట్టే ముక్కు! రవంత తేడాగూడా లేకుండా ఇవన్నీ ఆ గోడమీది బొమ్మలో ప్రత్యక్షమయాయి నాకు!

"ఎక్కడి ముక్కామల! ఎక్కడి అమెరికా! వీటిమధ్య దూరం కొన్నివేల మైళ్లుకదా! ఇంతదూరం లక్ష్యంచెయ్యక నేను వచ్చానేగాని, మా కోటయ్యశెట్టి ఎన్నడూ దేశం విడిచి ఎరగడే. అతడే కదలనప్పుడు అతని బొమ్మ ఇంతదూరం వచ్చి, ఈ గదిలో ఈ గోడమీద ఎలా వెలసిందో నాకు బోధపడలేదు.

'ఏమిటి ఈ చిత్రం?' అని ఆశ్చర్యపోతూ ఆ బొమ్మకేసే దీక్షగా చూశాను. చూస్తినిగదా, మొదటిరోజున కూచుని కనపడ్డ బొమ్మల్లా అప్పుడు నాకుమల్లేనే వెల్లకితలా ఒక మంచంమీద పరున్నట్లు కనపడింది. ఇది మరీ చిత్రంగా ఉందే! అగదిలోకి ఒక్క నౌఖరుతప్ప మరెవరూ రారు. వాణ్ణి, 'ఈ బొమ్మ నీవేమైనా ముట్టుకున్నావా?' అని అడిగేను. 'లేదు' అన్నాడు. నాకేమీ పాలుపోలేదు. ఆ బొమ్మకేసి అలా చూస్తోనే ఉండిపోయాను. నౌఖరు మధ్యమధ్య మందూ, సగ్గుజావా ఇచ్చి పోతున్నాడు.

"రోజు తరవాత రోజు గడిచింది. నాకు క్రమంగా రోగం మళ్లీ స్వస్థతకలుగుతోంది. కాని గోడమీదిబొమ్మ ఇంకా అలాగే పరుండి ఉంది. మరొక చిత్రమేమిటంటే మొదట లావుగా ఎత్తుగా ఉండే అతడి

బొజ్జ క్రమంగా తరిగిపోయింది. ఆ ముక్కు కూడా పల్చబడిపోయింది! ముక్కు దాకా ఎందుకు? ఆకాటుకలాంటి శరీరచ్ఛాయే మారుతూ వచ్చి, అంతకుముందు గోడపైన స్పష్టంగా కనపడ్డ ఆకారం రోజురోజుకీ అస్పష్టంగా మారి 'కోటయ్య బొమ్మేనా ఇది?' అని అనిపించింది.

"నాకు లేచి కూచునే సత్తువ వచ్చిన తర్వాత నౌఖరుతో, 'అబ్బీ, వార్తాపత్రిక ఏదైనా తెచ్చిపెడుదూ' అన్నాను. వాడు, మనదేశం పత్రికే ఒకటి తెచ్చి నాముందు పడేశాడు. పత్రిక విప్పి చూస్తినిగదా, ఏముంది? 'గోదావరి మండలం కోనసీమ లోని ముక్కామల కాపురస్థుడూ కోటీశ్వరుడూ ఐన కోటయ్యశెట్టి దారుణమైన అజీర్ణవ్యాధిచేత బాధపడుతున్నాడు. ఘన వైద్యులంతా వచ్చి వైద్యం చేశారు. కుదరటం లేదు' అని ఉన్నది.

"నేను విచారంతో పత్రిక క్రిందపడేసి గోడవైపు చూశాను. శుష్కించిపోయిన కోటయ్యశెట్టిబొమ్మ అటూ ఇటూ బాధతో దొర్లుతూన్నట్లు తోచింది నాకు. ఆ దృశ్యం చూసేసరికి నాకు గుండె నీరైపోయి, నేను మరోగదిలోకి మారిపోయాను.




"మరో మూడురోజులు గడిచాక వచ్చిన వార్తాపత్రికలో, కోటయ్యశెట్టి స్నేహకోటి సంతతినీ దుఃఖసముద్రంలో ముంచేసి, స్వర్గస్థుడయాడని వుంది. నేను కన్నీరు తుడుచుకుంటూ అతడి బొమ్మ ఉన్న గదిలోకి పరుగెత్తి వెళ్ళేను. ఏమి చిత్రం! గోడమీద ఆ బొమ్మ లేదు. బెల్లు ఊడిపోయి, అంతమేరా నల్లగా కనపడుతూ వచ్చిన చోటంతా వెల్లవేసినట్లు ఐపోయింది. నేను నౌఖర్నిపిలిచి, 'అబ్బీ, ఈ గదికి మరామత్తు చేసి వెల్లవేశారా?' అని అడిగేను. 'అలాంటి దేదీ జరగలేదు, ఇప్పట్లో జరగదుకూడాను!' అనేశాడు."

పేర్రాజుగారు ఇలా ముగించి ఊరుకున్నాడు. శ్రోతలంతా ఇంక మెచ్చుకోటం మొదలుపెట్టేరు.

'చాలా అద్భుతంగా ఉంది! ఇక్కడుండే కోటయ్యశెట్టి ఆకారం వేలాదిమైళ్ల దూరంలో ఉన్న ఆ గోడమీద ప్రత్యక్షం కావటం చిత్రమైన విషయమే' అన్నాడు ఒకాయన.

ఇంకొకాయన 'ప్రత్యక్షం కావటమే కాదు; ఇక్కడ అజీర్ణంతో బాధపడుతూ వున్న శెట్టిలో వచ్చిన మార్పులన్నీ అక్కడ గోడమీద బొమ్మలో రావటం, ఇతడిక్కడ 'హరీ' అనటంతోనే అక్కడ ఆ బొమ్మ మాయమవటం మరీ చిత్రంగా ఉంది సుమండీ!" అన్నాడు.

ఇంతలో హాలు కొనన కూర్చున్న ఒక పెద్దమనిషి, 'ఐతే పేర్రాజుగారూ, మీరు అమెరికా ఎప్పుడు వెళ్ళేరు? అమెరికా, ఇంగ్లాండు—ఇలాంటి దేశాలకు వెళ్ళిన వాళ్లంతా అధమం పిలకమార్చి క్రాపింగూ, పంచెకట్టు మానేసి సూట్లూ వేస్తారు. నేను మిమ్మల్ని మీ చిన్నతనంనుంచీ చూస్తోనే ఉన్నాను. మీరు ఎన్నడూ పిలకా, పంచెకట్టూ మార్చినట్టుగాని పైదేశాలకు వెళ్లినట్లుగాని లేదే! అదీగాక, మన ముక్కామలలో కోటయ్యశెట్టి అనే కోటీశ్వరుడెవడు ఉండేవాడండీ? కోటీశ్వరుని మాట అటుంచి ఒక్క లక్షాధికారైనా ఉన్నాడా అని!' నిలదీసి అడిగాడు.

పేర్రాజుగారు నవ్వుతో, 'నేను చెప్పిన దాంట్లో ఉన్న అద్భుతం అంతా ఇదేమరి! నేను విదేశాలకు ఎన్నడూ వెళ్లకపోయినా మన ముక్కామలలో కోటయ్యలాంటి కోటీశ్వరుడెవడూ లేకపోయినా, మీరు కోరిన తక్షణం ఇంత కథ కల్పించగలిగానా? ఇంతకన్న అద్భుతం ఏముంటుంది చెప్పండీ?' అని జేబులో డబ్బీ పైకితీసి ఒక్క పొడుం పట్టు ఎక్కించారు.






పూర్వం ఒకప్పుడు నాగలోకంలో ఒక మహానాగు ఉండేది. ఆపాము సర్పరాజైన ఆదిశేషుని ప్రాపకం సంపాదించి, ఎప్పుడూ ఆయనను ఆశ్రయించుకుని కూడాకూడా తిరుగుతో ఉండేది.

ఒకనాడు ఆదిశేషుడు ఆ నాగుతో, 'ఏమోయ్, నువ్వు అస్తమానం నన్ను కని పెట్టుకు తిరుగుతున్నావు. నీమనస్సులో ఏదో కోరిక ఉన్నట్లుంది. నేను తీర్చ గలిగినట్టయితే తీరుస్తాను, సంశయించక చెప్పు' అన్నాడు.

ఆ నాగు వెంటనే రాజుకి నమస్కరించి, 'ప్రభూ, నాకొక కోరిక ఉన్నమాట వాస్తవమే. తమరు మరొకలాగున తలచను అని అభయమిస్తే మనవి చేసుకొంటాను' అన్నాడు.

'ఫరవాలేదోయ్, నాగూ! చెప్పు' అన్నాడు రాజు ఆప్యాయంతో.

రాజు సమ్మతించినందుకు నాగు పొంగిపోయి, 'స్వామీ, ఆశ్రితుల్లో ప్రధానుణ్ణి అయి గొప్పవాణ్ణి అనిపించుకుంటూన్న నాకు తక్కిన అన్ని నాగులకుమల్లే ఒకేఒక్క తలకాయ ఉండటం బాగాలేదు. ప్రభువుల కున్నట్లు వెయ్యి శిరస్సులు కాకపోయినా, ఒక్క నూరు తలకాయలైనా నాకుండేటట్లు అనుగ్రహించండి. ఇదే నా ప్రార్థన' అని కోరేడు.

ఆదిశేషుడు నవ్వి, 'వెఱ్ఱివాడా, నాకు వెయ్యి తలలు ఉన్నాయి అంటే ఊరికే కాదు. ఈ భూలోకాన్నంతటినీ ఆ తలల పైన మోయవలసిన విధి ఒకటి ఉంది గనుక, అన్ని అవసరమయాయి కాని లేకపోతే నేనూ మీ అందరికిమల్లే ఒకేఒక్క తలతో సుఖంగా ఉండేవాణ్ణి. నూరు తలలు కావాలనీ రెండువందల తలలు కావాలనీ కోరుకొని, లేని బెడద తెచ్చుకుంటివంటే,

టి. సత్యాజీ - రమణక్కపేట.



ఈ తలలన్నింటికీ సంరక్షణ చేసుకోలేక ఇబ్బందిపడాలి. కనుక ఉన్న ఒక్క తలతోనూ తృప్తిపడి ఊరుకోవటం మేలు' అని సలహా చెప్పేడు.

కాని నాగుకి రాజుమాట నచ్చలేదు. 'ఈ మాత్రందానికి మహా ఆర్చేవానికి మల్లేనూ తీర్చేవానికిమల్లేనూ కోరుకోమనడమెందుకు తీరి కూర్చోలేక ?' అనుకున్నాడు కూడాను మనస్సులో.

'ఏమంటావు ?' అన్నాడు మళ్లీ శేషుడు.

అందుకు నాగు, 'పోనీ మరొక్క తల ఐనా అదనంగా ఇప్పించండి' అన్నాడు చొరవచేసి.

అప్పుడు శేషుడు, 'సరే అలానే ఇస్తున్నాను. ఇప్పుడు నీకు తోక ఉన్నచోటున నీవు కోరిన రెండో తల యేర్పడుతుంది. కాని ఆ తలకు కళ్లుమాత్రం ఉండవు. ఏమంటే, నీ మొదటి తలకుమల్లేనే ఆ తలకుకూడా కళ్లు ఉంటే, అది నీ శరీరాన్ని అటు లాక్కుపోతానంటుంది. ఈ తల ఇటూ, ఆ తల అటూ లాగడం మొదలెడితే, నీ పని ఐనట్లే. కనుక కళ్లుగల నీ మొదటి తలే నీ శరీరాన్ని నడుపుతూ ఉంటుంది, రెండోతల అలంకారంగా ఉంచుకో' అని చెప్పి, పంపేశాడు.

ఇప్పుడు మహానాగుకి తోక పంపుగూడా తలగా మారిపోయి, అతనికెంతో ఆనందం, తృప్తి, గర్వం బయల్దేరినై. తక్కిన నాగులన్నీ మహానాగు ఆధిక్యతచూసి అసూయ పడ్డాయికూడాను.

ఆదిశేషుడు చెప్పిన సలహా ప్రకారం ఆ రెండు తలలనాగు మొదట కొంతకాలం కళ్లు ఉన్న మొదటి తలకే పెత్తనం ఇచ్చి, అది ఎటు లాక్కుపోతే అటే వెడుతూండేది. కాని ఒకనాడు రెండోతల దానితో, 'నీవు నన్ను ఏరికోరి తెచ్చుకున్నావు! అటువంటప్పుడు పాతదానిమీదకన్నా నామీద నీకు

ఎక్కువ మక్కువా, ప్రేమా, ఆదరణా ఉండాలికదా. చూడగా అటువంటి లక్షణాలు ఏవీలేవు సరిగదా, ఆ మునిలితలతో సమంగానైనా నన్ను చూడకపోతివే! ఈ పక్షపాతబుద్ధి నీకు ఉండటం న్యాయమేనా?' అని సణగటం మొదలెట్టింది.

అప్పుడు మహానాగు, 'పెద్దవాడూ, సర్పాలకు రాజూ ఐన ఆదిశేషుని సలహా ప్రకారం నడుస్తున్నాను. ఒక ఇంటిలో పెత్తనం ఒకళ్లకే ఉండాలిగాని ఇద్దరికి ఉండటం మేలుకాదుసుమా!' అన్నాడు.

అప్పుడు రెండవతల, 'అందుకు నేనూ వప్పుకొంటాను. కాని ఎల్లకాలం దానిపెత్తనమే ఐతే ఇంక నాపెత్తనం ఎప్పుడు? కొన్నాళ్లు నేనూ సాగిస్తాను. దాన్ని ఊరుకోమనండి' అని సబుపు చెప్పింది.

ఈమాటకు మహానాగు, 'నువ్వు చెప్పిన దానిలో న్యాయం లేకపోలేదు. కాని, దానికి ఉన్న అనుభవం నీకేది? అన్నింటికంటా ముఖ్యంగా, దానికి కళ్లు ఉన్నాయి. 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' అని పెద్దలు ఊరికే అన్నారా? అన్ని అవయవాలలోకి కన్ను ముఖ్యం. కన్నే లేనప్పుడు నీవు పెత్తనం ఏం చెయ్యగలుగు



తావు? ఒకవేళ చేసినా అది 'గుడ్డిపెత్తనమే' అనిపించుకుంటుంది. కనుక లేనిపోని బెడదలకు పోక అక్కవెనక చెల్లెలికి మల్లె నిశ్చింతగా ఉండు' అన్నాడు.

పైత్యం చేసినవాడికి పటిక బెల్లం చేదు అన్నట్లు, ఈ సలహా ఆ రెండోతలకు నచ్చనేలేదు. నచ్చక ఏంజేసింది?

మొదటి తల మామూలు ప్రకారం తన కళ్లు ఉపయోగించి జాగ్రతగా నాగు యొక్క శరీరాన్ని ఆహారం ఉన్న చోటుకి వెతుక్కుంటూ తీసుకుపోబోయేసరికి, రెండో తల, దారిలో తగిలిన ఒక మొక్క మొదలును గట్టిగా కరిచి పట్టుకుంది.

మొదటి తల ఎంత లాగినా పాముయొక్క శరీరం సాగిందేగాని, రెండో తల తనపట్టు వదలలేదు. ఇంకా లాగితే తెగిపోతుందన్న భయంకొద్దీ మొదటితల లాగటం మానేసింది. దానితో రెండోతల తనపట్టు నెగ్గిందన్న విజయగర్వంతో తనవైపే లాగటం మొదలెట్టింది.

అప్పుడు మొదటితల నాగుతో 'చూచావా రెండోతల అటు లాక్కుపోతోంది. ఇప్పుడు ఏమంటావు?' అని ఫిర్యాదుచేసింది.

అందుకు నాగు, 'సరే లాగనియ్యి. ఏం చెయ్యంమరి!' అని చేసేదిలేక నిస్పృహతో తన అసహాయతను వెల్లడించింది.

అంతట మొదటితల 'నేనేంచెయ్యగలను? నీ కర్మం నీది!' అనిచెప్పి విరక్తి భావంతో ఊరుకుంది.

సరే, అనుకున్నట్టుగా రెండోతల తన గుడ్డిపెత్తనం మొదలెట్టి తనసరదా తీర్చుకోబోయింది. ఒకరోజున నాగునీ, మొదటి తలనీ కలిపి బరబరా లాక్కుపోయింది. ఎక్కడికి? ఎక్కడికో దానికే తెలియదు. తెలియటానికి, కళ్లుంటేగా? గుడ్డిమాలోకం!—వెళ్లివెళ్లి, పాపం!—భగభగా మండిపోతున్న ఒక పెద్ద అగ్నిగుండంలో పడింది. ఇంకేముంది?—పడీ పడ్డంతోనే తనూ, నాగూ, మొదటితలాకూడా నిమిషంలో నుసిఅయి ఊరుకున్నాయి.

ఈ సంగతి తెలియటంతోనే తక్కిన నాగులన్నీచేరి, 'ఈ మహానాగు తీరి కూచోలేక ఆపద కోరితెచ్చుకున్నాడు. భగవంతుడిచ్చిన ఒక్క తలతో తృప్తిపడక వెఱ్ఱివేషాలకు పోయి నాశనమయ్యాడు' అంటూ సానుభూతితో నిట్టూర్చినై.

ఈవిధంగా తృప్తిలేకనూ, పెద్దలసలహా వినకనూ మహానాగు సుఖాన ఉన్న ప్రాణిం దుఃఖాన పెట్టుకోవటమేగాక, చివరకు కుటుంబంతోసహా ఆత్మనాశనం అయి పూరుకున్నది.





# పిచిక గూడు

పూర్వం ఒక దేవాంగికి రూపవతి అని ఒక కూతురుండేది. రూపవతికి గల అందాన్నిబట్టే ఆమెకు ఆ పేరు వచ్చింది. తన అందాల కూతురుని ఏమైనా సరే పట్టపురాజుకిచ్చి పెళ్లి చేయాలని దేవాంగి ఉబలాటపడేవాడు.

అతగాడి భార్య, 'రాజు ఎక్కడ? మన మెక్కడ? మన పిల్లని ఆయన పెళ్లి చేసుకుంటాడా? వెర్రిమొర్రి ఆలోచనలకి పోక మన కులంలోనే ఎక్కడన్నా ఒక పిల్లవాణ్ణి చూచి పెళ్లి చెయ్యండి' అనేది. కాని అతడుమటుకు 'ఛశ్, నీకేం తెలుసు? ఊరుకో' అంటూ ఆమె మాట తోసేసి, అస్తమానం ఈసంగతే మనసులో ఆలోచిస్తూ వుండేవాడు.

ఇలా ఉండగా ఒకనాడు ఆ పట్టణం ఏలే రాజుగారే అతగాడికి ఎదురయి 'ఏమిటోయ్ విశేషాలూ?' అన్నారు.

'ఏమున్నాయి మహాప్రభూ? మేమందరం యేకులలోంచి నూలుదారం తీసి, ఆ నూలుతో వస్త్రాలు నేస్తాం. మా అమ్మాయి రూపవతి అలాగాక వట్టిగడ్డిలోంచి బంగారు నూలు తీస్తుంది!' అన్నాడు దేవాంగి.

రాజు ఆశ్చర్యపోయి 'అయితే మీ అమ్మాయిని మా అంతఃపురానికి పంపించు. ఆ చిత్రమేమిటో చూస్తాము' అన్నారు.

దేవాంగి యింటికి తిరిగివచ్చి భార్యతో జరిగిన సంగతి చెప్పేసరికి, "అయ్యో! కర్మమా! ఇలా ఇటువంటి విడ్డూరపు కోతలెందుకు కోశారు? ఎన్నడైనా విన్నామా కన్నామా? తీరి కూచోలేక లేనిపోని బెడద ఒకటి తెచ్చిపెట్టారే' అని ముక్కుమీద వేలేసుకుంది.

'ఓసి తెలివితక్కువ పెద్దమ్మా! మన పిల్లని ఏదోవిధంగా తనవద్దకు రప్పించుకునేందుకే ఈ పన్నాగం పన్నాను! మన

పాలంకి వెంకటరామచంద్రమూర్తి - మదరాసు



రూపవతి రాజుగారి అంతఃపురానికి వెళ్లి అయన కంటపడిందంటే దాని అందానికి అయన ఆశ్చర్యపోయి, గడ్డిమాట, బంగారునూలు మాటా మరిచేపోతాడు. పెళ్లి ముహూర్తం పెట్టమని పౌరోహిత్య బ్రాహ్మడికి వెంటనే కబురు చేయించేస్తాడు' అంటూ పిల్లకి చక్కగా ముస్తాబు చేయించి గుఱ్ఱబ్బగ్గీలో కూచోబెట్టించి, కూతురును రాజుగారికోటకు పంపించాడు.

రాజుగారు రూపవతిని చూడ్డంతోనే ఒక రాట్నం, కదురూ, గంపెడు వట్టిగడ్డీ ఆమె ముందు పెట్టి, 'నేను మళ్లీ సాయంకాలం వచ్చేలోగా ఈ గడ్డిని బంగారు నూలుగా తీసెయ్యాలి! తియ్యకపోతే జాగ్రత్తసుమా!!' అని చెప్పి చక్కాపోయాడు.

రూపవతికి ఏం చెయ్యాలో తోచింది కాదు. 'తీరి కూచుని నా తండ్రి ఇలాంటి ఉపద్రవం తెచ్చిపెట్టాడేమిటి? ఇప్పుడేం చేసేది? ఈ సమయంలో నాకు తోడుపడేవారెవరు' అని తలచి తలచి దుఃఖించింది.

అంతలోనే మూడు అడుగుల పొట్టివాడొకడు కిటికీలోంచి లోపలకు దుమికి వచ్చి, 'అమ్మాయ్. నేను నీకు సాయం చేస్తాను భయపడకు' అన్నాడు. వాడికి అరడుగు పొడుగు ముక్కూ, రెండు అడుగుల పొడుగు గడ్డమున్నూ ఉన్నాయి.

వాడి ఆకారం చూసి రూపవతికి మొదట భయం వేసిందికాని, రాట్నం ముందు కూచుని కదురుకు గడ్డిపరకలు తగిలించి వాడు బర్ బర్ మని రాట్నం తిప్పి బంగారు పోచలు లాగుతూవుంటే ఆమెకు ఎక్కడలేని ధైర్యమూ కలిగి అమితంగా సంతోషించింది.

ఇదిచూచి వాడు "మరైతే అమ్మాయ్!- ఈ గడ్డినంతటినీ బంగారు దారంగా మారుస్తా. నాకేం బహుమతి ఇస్తావు?" అని అడిగాడు.

దానికేముంది. "నా మెడలో గొలుసు తీసి ఇచ్చేస్తానన్నది" రూపవతి తడుముకోకుండా.

'సరే' నని, వాడు గడ్డినంతటినీ బంగారు నూలుగా లాగేసి, ఆ పిల్ల ఇచ్చిన గొలుసు పుచ్చుకుని, కిటికీలోంచి బయటకు దుమికి మాయమయ్యాడు.

సాయంకాలానికి రాజుగారు వచ్చి చూసేసరికి సాలెగూడుకన్నా ఎక్కువ సన్నంగా తీసిన బంగారు నూలు కనపడి ఆయన కళ్లు జిగేలుమన్నాయి! యిది చూడగానే ఒక దురాశ కూడా పుట్టింది.

'గంపెడు గడ్డిమాత్రమే ఇచ్చానేమిటి, పొలాలనిండా బోలెడు గడ్డిమేటులుంటేను?' అనుకొని రాజు ఈమారు ఒక మేటెడు గడ్డి తెప్పించి, 'తెల్లవారేలోగా ఇదంతా బంగరు దారంగా తీసెయ్యాలి. లేకపోతే చూసుకో...!" అని చెప్పి వెళ్లిపోయాడు.

ఆమె తలుచుకోవటమే తడవుగా పొట్టివాడు చక్కావచ్చి, 'సరే, ఈ మేటెడు కూడా బంగారునూలుగా తీసేస్తాను. మరి నాకు ఏమిస్తావు?" అని అడిగాడు.

"అబ్బాయీ!—ఈ ఉంగరం తప్ప నావద్ద



ఇంకేమీ లేదు. కావలిస్తే ఇది తీసుకో" అంది రూపవతి.

ఆ పిల్ల కళ్లుమూసుకు తెరిచేలోగా, బర్ బర్‌మని రాట్నం తిప్పి, మేటెడు గడ్డినీ దారంగా మార్చిపెట్టేడు. ఆమె వేలిని ఉండే ఉంగరాన్ని చేతిలో పడేసుకుని పొట్టివాడు మాయమయ్యాడు.

తెల్లవారి వచ్చి చూడగా రాజు ఆశ్చర్యానికి అంతులేకపోయింది. భేష్, ఇలా తన గడ్డి అంతా బంగారం కావటం చిత్రంగానే వున్నదనుకొని పొంగిపోయి, ఈ మాటు మూడుమేట్ల గడ్డిని ఆమె ముందు పెట్టించాడు. ఇదంతా చూచేసరికల్లా రూప




వతికి ప్రాణం విసిగి ధైర్యంతో 'ప్రభూ, ఇంకా ఎన్నాళ్లు ఇలాగ దారం తియ్యాలి ?' అని అడిగేసింది.

ఇలా అడిగినందుకు రాజుగారికి కోపం రాలేదు. ఇప్పుడాయనకి రూపవతి అంటే చాలా గౌరవం, ప్రేమా పట్టుకొచ్చాయి. అందుకని, ' ఈ మూడు మేట్లగడ్డీ తీసెయ్య, చాలు !" అని చెప్పి, చక్కాపోయాడు.

రాజు వెళ్లటంతోనే మళ్లీ పొట్టివాడు వచ్చి "ఇదేకాదు, మీ రాజు రాజ్యంలో ఉన్న గడ్డి నంతనీ బంగారంగా మార్చేసి, పశువులకి గడ్డి లేకుండా చెయ్యగలను! మరి నాకేమిస్తావు ?" అని అడిగాడు.

ఏమీ చెప్పలేక రూపవతి, కన్నీళ్లు కారుస్తూ 'నాదగ్గిర ఇంకేమీ లేదే' అంది.

అప్పుడు పొట్టివాడు, 'ఈ గడ్డి నంతటినీ బంగారంగా మారుస్తా. రాజు వచ్చి చూసి మెచ్చుకుని నిన్ను పెళ్లిచేసుకుంటాడు. యేడాదికల్లా నీకు కొడుకు పుడతాడు. ఆ కొడుకును నాకు ఇస్తానంటే నీకు నూలు తీసిపెడతాను' అన్నాడు.

"రాజు నన్ను పెళ్లిచేసుకుని, నాకు కొడుకంటూ పుడితేకదా వీడికి నేనివ్వబోవటం ? అప్పటికి ఈగడం గడిస్తే అప్పటి మాట చూసుకోవచ్చు' అనుకొని, రూపవతి ఒప్పుకుంది. ఆమె కళ్లు మూసి తెరిచేలోగా గడ్డి అంతా బంగారు నూలై పడిఉన్నది. పొట్టివాడు మాయమయాడు.

రాజు వచ్చాడు. నూలు చూచాడు. బ్రహ్మానందభరితుడయాడు. ఆరోజునే రూపవతిని వివాహం చేసేసుకున్నాడు.

రూపవతి రాణీఐన యేడాదికి, పున్నమచంద్రుడులాంటి కుమారుడు పుట్టేడు. ఇరవైఒకటోనాడు పిల్లవాణ్ణి తొట్టెలో పెడతారనగా పొట్టివాడు ప్రత్యక్షమై, 'రాణీ, నీ కొడుకుని తీసుకువెళ్లటానికే వచ్చాను!' అన్నాడు.

ఆమె గుండె గుభేలుమంది. వాగ్దానం మాట జ్ఞాపకమే లేదు. జాలిగా, ఆమె "అయ్యో! నా ముద్దుబిడ్డ నివ్వమంటే ఎట్లా? బదులుగా మరేమైనా కోరుకో" అంది.

"పనికిరాదు. బిడ్డడే కావాలి" అని పొట్టివాడు పట్టుబట్టేడు.

చేసేదిలేక, రాణి "పోనీ, పిల్లవాణ్ణి ఒక్క యేడాదిపాటు నావద్ద పెరగనియ్యి. తర్వాత తీసుకువెడుదు గానిలే" అంది. "సరే" అని పొట్టివాడు మాయమయాడు. యేడాదీ పూర్తి అయేసరికి పొట్టివాడు మళ్లీ ప్రత్యక్షమై, "తే, పిల్లవాణ్ణి!" అన్నాడు.

రాణి, "అయ్యో! బిడ్డ ఇప్పుడిప్పుడే పాకడం నేర్చుకున్నాడు. కాస్త తప్పటడుగులు వేస్తూంటే చూడాలని ముచ్చటగా ఉంది. మరొక్క యేడాది పోనియ్యి" అంది. "సరే" అని చెప్పిపోయి, పొట్టివాడు సరిగ్గా మళ్లీ యేడాదినాటికి సిద్ధమయాడు.

రాణి, "బిడ్డడి ముద్దు పలుకులు వినకుండా ఎలా ఇచ్చెయ్యను? మరొక్క యేడాది పోనియ్యి" అంటూ మళ్లీ ఒకసారి బతిమలాడింది.

ఈసారి పొట్టివాడికి కోపంవచ్చింది. "ఏవమ్మోయ్, నీకు వేళాకోళంగా ఉన్న



ట్టుంది చూస్తే. నే నెవణ్ణనుకున్నావ్? భూతాల్లోకల్లా గొప్ప భూతాన్ని. నా కర్మం గాలి మావాళ్లకీ నాకూ పేచీవచ్చి ఇలా చక్కావచ్చాను గాని, లేకపోతే భూతాలన్నిటికీ రాజును కావలసినవాణ్ణి. నాకు కోపం తెప్పించావో నిన్నూ, నీ బిడ్డనీ, అందర్నీ మింగేస్తాను తెలుసా?" అన్నాడు.

అప్పుడు రాణీ, "భూతరాజా!—నీకూ మీవాళ్లకీ ఎందుకు పేచీ వచ్చింది?" అని మాట మార్చటానికని అడిగింది.

వాడికి కోపంతగ్గి, "అదంతా నీకెందుకులే.. కొన్ని పాడు పిచికలు చేశాయి! నా కర్మం కాలి నేను నిద్రపోతూంటే అ

పిచికలు ఎక్కడా చోటులేనట్టు నా గడ్డంలో గూడు కట్టుకోవడమేమిటి? ..ఎందుకులే నీకా గొడవ? మళ్ళీ వస్తాను. అప్పుడు నీ పిల్లవాణ్ణి ఇచ్చెయ్యాలి సుమా" అని ఖరాఖండీగా చెప్పి చక్కాపోయాడు.

ఏడాదీ ఇట్టే గడిచిపోయింది. రాణీగారి అబ్బాయికి మాటలూ వచ్చేశాయి. భూతం ప్రత్యక్షమై గడ్డం సవరించుకుంటూ "ఇచ్చెయ్యి పిల్లవాణ్ణి!" అన్నాడు.

ఏంచెయ్యటానికీ ఆమెకు పాలుపోక కంట నీరుపెట్టుకుని పిల్లవాడికేసి చూడటం మొదలెట్టింది. పిల్లవాడు మాత్రం ఇంటి దూలంకేసి వేలెట్టిచూపుతూ, "అమ్మోయ్, పిచ్గ్గూలే! పిచికగూలు" అన్నాడు.

"ఏమిటి చెప్మా?" అంటూ రాణీ దూలంకేసి చూసేసరికి అక్కడ ఒక పిచికగూడు కనపడగా, ఆవిడకూడా "అవునురా నాయనా, పిచికగూడు" అంది. దాసీవాళ్ళంతా ఒక్కమారుగా 'అవునండి అమ్మగారూ!—పిచికగూడు, పిచికగూడు' అన్నారు.

దాంతో పొట్టివాడు కళ్ళెరచేసి, "ఏమిటీ నన్ను పిచ్గ్గూడు అని ఉడికిస్తున్నారా? మీకూ ఈ పొయికాలమే వచ్చిందా? మా భూతాలు నన్నిలా ఆడిస్తున్నాయనేకదా అక్కణ్ణుంచి నేను వచ్చేస్త" అని బొబ్బలెడుతూ అరిచాడు.

"పిచికగూడు" అంటే ఆ పొట్టివాడు ఉడుకుతాడని తెలిపోయింది. అమట్టున "పిచికగూడు, పిచికగూడు" అని రాణీ చప్పట్లు చరిచింది. ఈ మాట అందిపుచ్చుకొని దాసీవాళ్ళందరూ, ఎగతాళి చేయటం మొదలెట్టేరు.

పొట్టివాడికి ఉడుకుబోత్తనం వచ్చేసింది. "నన్ను మీరిల్లా అవమానం చేశారు గనక మీ గుమ్మం ఎక్కనే ఎక్కను!' అంటూ చక్కాపోయాడు.

పీడ వదిలిందని రాణీ సంతోషించింది.





# ఉత్తము పుత్రుడు

చైనా దేశంలో ఒక పురాతన పట్టణం ఉండేది. ఆ పట్టణంలో హ్యూయెన్ అనే ఒక ధనికుడు ఉండేవాడు. వాడు చాలా దుర్మార్గుడు. ఎవరిపైన ఐనా వాడికి కోపం వచ్చిందీ అంటే వాళ్లపని పట్టించాడన్న మాటే. డబ్బున్నవాడు కాబట్టి రౌడీలను ఉసుకొల్పి తన కోపానికి గురిఐనవాళ్ల నందరినీ హత్య చేయించటమో, మరో విధంగా హింసించటమో చేస్తుండేవాడు.

అవూళ్లోనే వాంగ్ అనే పేదవాడొకడు ఉండేవాడు. పేదవాడే ఐనా, వాంగు ధైర్య వంతుడు. హ్యూయెన్ చేస్తూన్న అక్రమా లను అతడు సహించలేక, ఒకనాడు పని కట్టుకుని ఆ నగరాన్ని యేలే రాజువద్దకు పోయి హ్యూయెన్‌ను మందలించమని ప్రార్థించాడు.

రాజు వాంగు మాట లక్ష్యపెట్టలేదు. 'ఆ ధనికుడంటే కిట్టక చెప్పుతున్నాడు' అని అపోహపడ్డాడేగాని నిజమేమిటో తెలుసుకోటానికి రాజు ప్రయత్నించలేదు. పైగా 'ఇలాంటి చాడీలు చెప్పకు పో' అని వాంగుమీదే కోపపడ్డాడు.

'పేదవానిమాట పెదవికి చేటు' అన్నట్టయింది వాంగు పని. విచారిస్తూ అతడు తన యింటికి తిరిగివస్తూండగా అతనికి, "అమ్మోయ్, బాబోయ్" అని యేడుపు వినిపించింది.

"ఏమిటి చెప్మా?" అని వాంగు అక్కడికి పోయి చూసేసరికి, హ్యూయెన్ ఒక ముసిలిదాన్ని కొరడా పుచ్చుకుని తోలు ఊడొచ్చేటట్టుగా బాదుతూ వున్నాడు.

వాడు పళ్లు బిగించి, "ఇరవైనాలుగు, ఇరవైయైదు ......" అని లెక్కపెడుతూ కొడుతూండేసరికి వాంగుకి గుండె నీరైపోయింది. కోపం ఉబికివచ్చింది., తానేం చేస్తూన్నదీ తెలియకుండానే, అక్కడేదో

హెచ్. గురుదానప్ప - హొసూరు



ఇంక రెండు రోజులకి వాంగుని ఉరి తీస్తారనగా, వాంగు స్నేహితులూ, ఇంకా ఊళ్లో పెద్దమనుష్యులు కొందరూ చేరి రాజుగారివద్దకు వెళ్లి, "ప్రభూ, వాంగు చాలా మంచివాడు. చనిపోయిన హ్యూయెను చాలా దుర్మార్గుడు. హ్యూయెను చేస్తూన్న దౌర్జన్యం చూచి సహించలేక వాంగు వాడిపైన చెయ్యిచేసుకున్నాడేగాని మరొక కారణంచేత కాదు. కనుక ఈసారి క్షమించి వదిలెయ్యండి" అని కోరుకున్నారు.

కాని రాజు చలించలేదు. వచ్చిన వాళ్లంతా లాభం లేదని వెళ్లిపోతూంటే పధ్నాలుగేళ్ల బాలుడొకడు రాజుగారి ముందు సాష్టాంగపడి, "ప్రభూ, వాంగు ప్రాణాలకు బదులు నా ప్రాణాలు తీయించండి" అన్నాడు.

ఆ మాటలు వినేసరికి, రాజుకీ అక్కడ తక్కినవాళ్లందరికీ ఆశ్చర్యం వేసింది.

"ఎవర్రా అబ్బాయి నువ్వు?" అని అడిగాడు రాజు.

"ప్రభూ, నేను వాంగు కుమారుణ్ణి. మా తల్లికి మేము నలుగురు కొడుకులం. నేను పెద్దవాణ్ణి. నేను పోయినా మా అమ్మకు ఇంకా ముగ్గురు మిగులుతారు. కనుక

ఒక గునపం పడిఉంటే దాన్ని తీసుకుని హ్యూయెను గుండెలో ఒక్కపోటు పొడిచాడు. హ్యూయెను చచ్చి ఊరుకున్నాడు.

కోపంతో అంతపని చేశాడేకాని, ఆ కోపం చల్లారిపోవడంతోనే వాంగు తను చేసిన పనికి పశ్చాత్తాపపడ్డాడు. తిన్నగా రాజు వద్దకు పోయి, "ప్రభూ, నేను హ్యూయెనను చంపివేశాను. నాకు తగిన దండన విధించండి" అని అడిగేడు.

అందుకు రాజు, "ఒక ధనికుణ్ణీ పేదవాడొకడు చంపివెయ్యటమా?" అని మండిపడి, మారు ఆలోచన లేకుండా వాంగుకి మరణదండన విధించాడు.

ఆమెకు అంతగా కష్టముండదు. మా నాయన లేకపోతేమాత్రం కుటుంబయాత్ర జరగటమే కష్టం" అన్నాడు కుర్రవాడు.

ఈ మాటలు వినేసరికి రాజుకు ఇంకా ఆశ్చర్యం వేసింది. ఆయన "ఒరే అబ్బీ, నిన్ను మీ అమ్మ పంపిందా? లేక నువ్వే వచ్చావా?" అని అడిగేడు.

ఆ కుర్రవాడు, "ప్రభూ నేను మా అమ్మకి చెప్పకుండానే వచ్చాను. ఏమంటే మానాయన బ్రతకటం ఆమెకు సంతోషమే. ఐనా కొడుకును పోగొట్టుకోటానికి ఏ తల్లి ఇష్టపడుతుంది? నెమ్మదిమీద మనస్సు ఎలాగో కుదురుపరుచుకుంటుందనే ధైర్యంతో నేనే ఇలా వచ్చేశాను" అన్నాడు.

వాడి మాటలు విన్న రాజుకి హృదయం కరిగిపోయింది. "అబ్బీ, నీ ప్రార్థన నేను అంగీకరించాను" అన్నాడు.

బాలుడు బ్రహ్మానందంతో మళ్లీ ఒక మారు రాజుముందు సాష్టాంగపడి "ప్రభూ, నేను ధన్యుణ్ణి! తమకెంతో కృతజ్ఞుణ్ణి! ఎల్లుండివరకూ ఆగటం ఎందుకు? ఇప్పుడే మా నాయనను చెఱనుండి విడుదల చేయించి, ఆయనస్థానే నన్ను ఉరి దీయించండి" అని ప్రార్థించాడు.




రాజు కళ్లవెంబడి బొటబొట నీరు కారుస్తూ, "వెఱ్ఱివాడా, 'నీ ప్రార్థనను నేను అంగీకరించాను' అనటంలో నా ఉద్దేశం నీ తండ్రి ప్రాణాలకు బదులు నీ ప్రాణాలను తీయించాలని కాదు. నీవంటి ఉత్తమ బాలుడు చిరాయువై వర్ధిల్లాలిగాని ఇలాంటి దుర్మరణానికి పాలుగాకూడదు. నీలాంటి ఉత్తమ పుత్రుణ్ణి కన్నటువంటి వాంగుకూడా ఉత్తముడే కనుక శిక్షార్హుడు కాడు. దుర్మార్గుడైన హ్యూయెనును వాంగ్ రుపంలో భగవంతుడే శిక్షించాడు" అని చెప్పి తక్షణమే వాంగును ఖైదునించి విడిపించాడు.




## 9

ధనరాజుగారు గొప్ప జమీందారు. ఎరిగి ఎవళ్లకూ కానీఐనా ధర్మం చేసినవాడు కాదు. ఆయనకు అవసానకాలం సమీపించేసరికి ఒక వదంతి వ్యాపించింది—తన ఆస్తి అంతా పేదలకు పంచిపెట్టబోతున్నాడని.

నలుగురూ చేరి ఆయనవద్దకు వెళ్లి, 'మా మాట యేమి చెప్పావయ్యా ధనరాజా!' అని అడిగారు. అందుకు జమీందారు వాళ్లతో "అయ్యో నాయనలారా! పుణ్యం పాపం లేకండా, దైవచింత లేకండా రెండు చేతులా ఆర్జించి పడవేశాను. పదిమంది పాడైతే కాని ఒకడు బాగుపడడని అంటారు. దీన్నిబట్టి చూస్తే పేదల కడుపు కొట్టి కదా మనం ఇంతటివాళ్లమయ్యాం అని అనిపిస్తున్నది. ఇప్పుడైనా పిడికిలి విప్పి, పేదల సొమ్ము పేదలకే చెందజెయ్యాలని నిశ్చయించాను. లేకుంటే, పుట్టగతులుంటాయా!" అన్నాడు ఆప్యాయంతో. జనం ఉత్సాహంతో జేజేలు కొట్టారు.

ఇంతలో జమీందారు కొడుకులు శోకాలు పెడుతూ వచ్చారు. వాళ్లను సముదాయిస్తూ ధనరాజు "అబ్బాయిలూ!—ఇలా నేను ధర్మం చేసినందుకు మీరు విచారించకండి. ఇదీ ఒక మంచికే వచ్చిందని నమ్మండి. ఏమంటే—చేతిలో పైసా లేకుండా నేను జీవితం ప్రారంభించాను. స్వయంకృషివల్ల ఇంతటివాణ్ణి అయాను. మీరూ నాలాగానే ప్రయోజకులు కావటం నా వుద్దేశం" అని హితవు చెప్పాడు.

జమీందారు తన ఆస్తిని ఆ పేదవాళ్లకు రాసియిచ్చి కన్ను మూసివేశాడు. తీరా తరవాత లెక్కలు చూడగా, నగదు నిలవ ముప్ఫయివేలూ, అప్పులు లక్షా యాభైవేలూ అని తేలింది. ఆస్తికి వారసులం అంటూ చొరచుకువచ్చిన పేదలందరూ తలకొక పన్నెండేసి రూపాయలూ ఋణదాతలకు ఇచ్చుకోవాలని కోర్టువారు డిక్రీ ఇచ్చేసరికి, వాళ్లంతా తెల్లబోయారు!

## 10

ఒకవూళ్లో ఒక ఆశపోతు రామన్న ఉండేవాడు. వాడు డబ్బా అంటే ఏ పనికైనా ఒడంబడేవాడు. ఈ కీలకం తెలిసిన ఒక పొరుగూరువాడు అతనివద్దకు వచ్చి "ఏమండి రామన్నగారూ!—ఇక్కడికి రెండు కోసుల దూరంలో బ్రహ్మాండమైన ఒక పుట్ట వున్నది. ఆ పుట్టలో మహిమగల నాగుమయ్యలున్నాయి. ఆ మహిమలవల్ల మేలు పొందటానికని, జనం ముప్పొద్దులా పుట్టకి మొక్కులిడి దక్షిణలు సమర్పిస్తూ వుంటారు. నేను పుట్టి బుద్ధెరిగినప్పటినించీ అందులో డబ్బులు పడుతూనే వుండటం చూస్తూనేవున్నా" అని చెప్పాడు.

'మరైతే, పుట్ట తవ్వి ఆ ధనమంతా నువు తీసుకోలేకపొయ్యావా?' అని అడిగాడు రామన్న. అందుకు వాడు "అమ్మయ్యో! పుట్ట తాకటమే!! నాగుమయ్యల జోలికి పొయ్యామంటే రెండు కళ్లూ దించుకపోవూ?" అన్నాడు పొరుగువాడు.

'మనవాళ్ల పిచ్చినమ్మకాలంటే ఇవే. ఆ పుట్ట ఎక్కడుందో నాకు చూపించు. ఈ రహస్యం పిట్టకైనా తెలియనివ్వకుసుమా!' అంటూ ఒక ఐదు రూపాయలు వాడి చేతులో పెట్టాడు, రామన్న.

రాత్రికి రాత్రి రామన్న పదిమంది కూలీలను వెంటబెట్టుకు వెళ్లి, పుట్ట తవ్వించాడు. నాగుల్ని తరిమివేయించాడు. అందులో ఒక నాగు వచ్చి కూలీలలో ఒకణ్ణి కాటు వేసింది. వాడి కుటుంబానికి భరణమిచ్చుకోవలసివచ్చింది, తీరా రామన్న. పుట్ట అడుక్కంటా తవ్వించి చూడగా సుమారు మూడువందలు రాగి కానీలు మాత్రం కనిపించినై! అనగా మూడు రూపాయిల చిల్లర అన్నమాట!! పొరుగూరివాడికి బహుమతి; కూలీవాడి కుటుంబానికి భరణం చేతివివదిలి, ఈ మూడు రూపాయిల చిల్లరమాత్రం దక్కింది!!! ఈ పరాభవానికి రామన్న సిగ్గుపడి, బుద్ధి తెచ్చుకున్నాడు.

అక్టోబరు నెల మాకు వచ్చిన చిట్టికథలలో పై రెండు కథలూ బహుమతి పొందినై.

9-వ కథ—వ్రాసినది: పి. రుక్మిణి, నెల్లూరు — బహుమతిగా ఈమెకు టాయ్‌లెటు సెట్టు ఒకటి పంపుతున్నాం. 10-వ కథ—వ్రాసినది: జె. రమణ, ఆర్కోణం బహుమతిగా అతనికి ఇంగ్లీషు-తెలుగు డిక్షనరీ పంపుతున్నాం.



# స్వర్ణకూపం



ఒక పల్లెలో విక్రముడనే పేద కుర్రవాడొకడుండేవాడు. తన వూళ్లో తనకు గడిచే ఎత్తు కనపడక, వాడు ఒక పట్నం చేరుకొని, బజారు మొనలో నిలబడి, కనపడ్డవారినల్లా 'ఏమండీ, మీకు నౌఖరు కావాలా?' అని అడుగుతూ వచ్చాడు. 'మాకు అక్కర్లేదం'టే 'మాకు అక్కర్లేద'ంటూ వాళ్ల దారిని వాళ్లు చక్కాబోయేవారు.

ప్రొద్దుగుంకే సమయానికి తళతళ మెరిసిపోతూన్న జలతారు దుస్తులు వేసుకుని ఒక వర్తకుడు వచ్చాడు. దుస్తులు చూస్తే చాలా ధనవంతుడులాగ ఉన్నా మొగం చూస్తేమాత్రం గుడ్లగూబలాగ ఉండటంచేత, విక్రముడికి ఆ వర్తకునితో మాట్లాడ బుద్ధే వేసిందికాదు.

ఆ వర్తకుడే విక్రముణ్ణి పలకరించి 'ఒరే అబ్బీ, నాకొక నౌఖరు కావాలి. రోజూ పదిరూపాయలు జీతం ఇస్తాను. వస్తావా?' అన్నాడు. విక్రముడు ఆ వర్తకుడివద్ద కుదిరి, వాని వెనకాలే వెళ్లేడు.

వర్తకుడు ఓడరేవుకి వచ్చి, తన ఓడలో విక్రముణ్ణి కూచోబెట్టుకుని, ఇంటికి వెళ్లేడు. ఆ ఇల్లు చాలా చిత్రమైంది. అది సముద్రంలో ఒక పెద్దకొండవారని ఉండే చాలా గొప్ప భవనం. గోడలన్నీ బంగారపువి! వాసాలన్నీ వెండివి!! పెంకులన్నీ భమిడివి!! విక్రముడు ఆశ్చర్యంతో ఆ వర్తకుని వెనకాలే భవనంలో ప్రవేశించాడు. వాళ్లకి పదహారేళ్ల బాలామణి ఒకర్తె ఎదురైంది. ఆ అమ్మాయి శరీరచ్ఛాయ బంగారపు కాంతిని మించివున్నది.

ఆ అమ్మాయి అందం చూసి విక్రముడు విస్తుపోయాడు. అన్నట్టు విక్రముడుకూడా చాలా అందమైనవాడూ, బలమైనవాడూను. అతన్ని చూసేసరికి ఆ అమ్మాయికికూడా అలాగే అనిపించింది. అతన్ని చూడగానే

జి. సాంబశివరావు - జగదల్పూర్



ఆమెకు జాలీ, విచారమూ కలిగినై. ఆ సంగతి గుడ్లగూబయ్య కనిపెట్టలేదుగాని, విక్రముడు మాత్రం కనిపెట్టేడు. ఐనా, ఆవిడ జాలికి గల కారణం మటుకు ఊహించుకోలేకపోయాడు.

గుడ్లగూబయ్య విక్రముడికి రాత్రి భోజనం పెట్టించి, 'అబ్బీ, పెందరాళే నిద్రపో. మనం తెల్లవారుఝామునే లేచి ఒకచోటికి వెళ్ళాలి'—అని పడుకోవటాని కొక గది చూపించాడు. గుడ్లగూబయ్య తన గదికి పోవటంతోనే అంతకుముందు విక్రముడికి కనపడిన బాలామణి చడీ చప్పుడూ కాకుండా మెల్లిగా అతనివద్దకు వచ్చి, అతని చేతిలో కాగితంలో చుట్టి ఉన్న ఒక గాజుబుడ్డిని పెట్టి, ఒక్కమాట ఐనా ఆడకుండా వెళ్లిపోయింది. విక్రముడు ఆశ్చర్యపోతూ ఆ కాగితం విప్పిచూసుకునే సరికి అందులో 'నీకేమైనా ఆపద మూడితే ఈ గాజుబుడ్డిని బద్దలగొట్టు' అని రాసి ఉంది. ఎందుకైనా మంచిద'ని ఆ బుడ్డిని మొలలో దోపుకొని, అతడు నిద్రించాడు.

తెల్లవారుఝామునే గుడ్లగూబయ్య వచ్చి విక్రముణ్ణి లేపి తనకూడా రమ్మన్నాడు. ఒక గుఱ్ఱంమీద కొన్ని గోనెసంచులు వేసి, విక్రముణ్ణి దాని కళ్లెం పట్టుకుని తన వెనకాలే నడిపించుకురమ్మని ఆజ్ఞాపించాడు. వాళ్ళిద్దరూ ఆ గుఱ్ఱంతో కొండ దారమ్మటే శిఖరం ఎక్కి వెళ్లేరు. వెళ్లగా వెళ్లగా పర్వతంకొసని ఒక తాడిచెట్టంత ఎత్తున నిటారుగ్గా ఒక నున్నటి పలక రాయి అడ్డువచ్చింది. ఆ శిఖరం నాలుగు వైపులా ఆవేమోస్తరుగా ఉంది.

'నలుచదరపు రాతిబోషాణంలా ఉన్న ఈ శిఖరం పైకి వెడితే అక్కడ బంగారపు కణికలుండే గొయ్యి కనపడుతుంది. వాటి కోసమే సుమా వచ్చాం మనం' అన్నాడు గుడ్లగూబయ్య.



ఇలా అంటూ శ్రమ తీరడానికని తెచ్చిన షర్బత్తు పెద్దసీసా విక్రమునికిచ్చి, చిన్న సీసా తను తీసుకుని తాగేశాడు. విక్రముడు వాడి ఔదార్యానికి మెచ్చుకుంటూ ఆ సీసా షర్బత్తునూ రెండు గుటకల్లో తాగేశాడు. తాగీ తాగడంతోనే అతడికి కళ్లు మూతలు పడిపోయి, నిద్ర ముంచుకొచ్చింది.

గూబయ్యా వెంటనే ఒక సంచీలోంచి పెద్ద తోలుతిత్తి ఒకటి తీసి, నిద్రబోతూన్న విక్రముణ్ణి ఆ తిత్తిలో దూర్చి, అతడి ప్రక్కలో పొడుగాటి కామకు అతికి ఉన్న ఒక ఇనపరేకునుకూడా పెట్టి కట్టేశాడు. ఆ తిత్తిని అక్కడ అలాగనే వదిలి, వాడు గుఱ్ఱాన్ని తీసుకుని కొంచెం దూరంగా పోయి నిలబడ్డాడు. గూబయ్యా అలా వెళ్లాడో లేదో, కొండ కొననుంచి ఇనపముక్కులూ, ఉక్కురెక్కలూ గల కాకులు దిగివచ్చి, విక్రముడితో సహా ఆ తోలుతిత్తిని పైకి ఎత్తుకెళ్లి, ఆ బంగారపు గోతిలో పడేశాయి. పడవేసి, ఆ కాకులు తమ ఇనపముక్కులతో ఆ తిత్తిని పొడవటం మొదలెట్టినై.

లోపల ఉన్న విక్రముడికి మత్తు వదిలి, 'ఈ కాకులేమిటి? ఈ తిత్తి యేమిటి?' అనుకుంటూ ఊడిపడ్డాడు. తనపక్కనే తగిలిన ఇనపరేకును దొరకపుచ్చుకొని, ఆ కాకులను చెండాడివేశాడు.

విక్రముడు నిలబడి ఆయాసం తీర్చుకుంటూవుండగా కిందనుంచి కేక వినపడింది: 'మళ్లీ కాకులు చుట్టుముట్టకుండా ఆ ఇనపరేకుతో బంగారు కణికలు ఎత్తి కింద పొయ్యి' అని అరిచాడు గూబయ్యా.

వెంటనే విక్రముడు ఇనపవేటతో ఆ కణికల్ని ఎత్తి, ధారకట్టి కిందికి పోశాడు. గూబయ్యా కణికల్ని సంచీలలో నింపుకొని, 'ఇంక చాలు' అని కేకవేసి, సంచులు గుఱ్ఱంమీద కెక్కించి, మెల్లిగా తిరుగుదారి పట్టేడు.









విక్రముడు తను రాకుండా వెళ్ళిపోతూన్న గూబయ్యను చూసి, 'ఏమయ్యోయ్, నా మాటేమిటి?' అని అరిచాడు. గూబయ్య వికారంగా నవ్వుతో 'నీ మాటా? ఆ గోతిలోనే మనుషుల ఎముకలగూళ్ళు కనపడతాయి. లెక్కపెట్టి చూడు. తొంభైతొమ్మిది ఉంటాయి! నువ్వు నూరోవాడివి!!' అంటూ ఇంక వెనక్కి తిరిగి చూడక, వెళ్ళిపోయాడు.

'ఎంత దుర్మార్గుడు! ఇందుకేనా వీడు నాకు రోజూ పదిరూపాయిల జీతం ఇస్తానన్నాడు!' అనుకుని విక్రముడు దిక్కులు చూసేసరికి ముములాళ్ళకు మల్లే చుట్టూ కాకులు కనపడ్డాయి. 'రెండు మూడు రోజులయేసరికి ఉపవాసాలతో నాకు ఓపిక తగ్గిపోతుంది. అప్పుడు ఇంక ఈ కాకులతో పోట్లాడలేక, వీటికి బలి ఐపోతానుకాబోలు' అని అధైర్యపడ్డాడు.

ఐనా గుండె నిబ్బరం చేసుకుని, ఉక్కకు ఆగలేక చొక్కా విప్పుకోబోతోంటే మొలలో ఉన్న గాజుబుడ్డి చేతికి తగిలింది. వెంటనే అతనికి బాలామణి రాసిన చీటీ సంగతి జ్ఞాపకం వచ్చి, గాజుబుడ్డిని బద్దల కొట్టేడు.

పెద్ద చప్పుడుతో అది బద్దలై, అందులోంచి భయంకరమైన భూతం ఒకటి బయటపడి, విక్రముని ముందు నిలిచింది. 'అరే మానవుడా! మునీశ్వరుడు కోపగించి నన్ని బుడ్డిలో బంధించాడు. వేలకొద్ది సంవత్సరాలనుంచి నేను ఇందులో ఉండిపోవలసొచ్చింది. నీ ధర్మమా అంటూ బయటపడ్డాను, ఇంక క్షణమైనా ఆగను. నీకు ఉపకారం చేసిపోతా. ఏమైనా కోరుకో' అంది ఆ భూతం. 'ఈ మృత్యుకూపంలోంచి నన్ను రక్షించు' అన్నాడు విక్రముడు. మరుక్షణంలో అతడు మొదట గుడ్లగూబయ్యతో తారసపడ్డ బజారులో ఉన్నాడు!



విక్రముడు ధైర్యం తెచ్చుకుని గడ్డం, మీసాలూ అమ్మే ఒక దుకాణంలో ఒక జత కొని మారువేషం వేసుకుని వుంటున్నాడు.

కొన్నాళ్లయేసరికి గుడ్లగూబయ్య ఆ బజారుకు వచ్చి, మళ్లీ నౌఖరుకోసం చూస్తున్నాడు. మాయవేషంతో ఉన్న విక్రముడే మళ్లీ నౌఖరుగా కుదిరేడు. గుడ్లగూబయ్య విక్రముణ్ణి పోల్చుకోనేలేదు. ఇదివరకుమల్లేనే గూబయ్యతో ఆ గడ్డమయ్య ఓడలో వెళ్లి, బంగారు భవనం చేరుకున్నాడు. ఇదివరకుమల్లేనే తెల్లవారుఝామున వాళ్లిద్దరూ కొండశిఖరం మీదికి ప్రయాణమై వెళ్లేరు.

ఈమాటు విక్రముడు సీసాలలోని షర్బత్తును యుక్తివల్ల తారుమారుచేసి మత్తుమందున్న షర్బత్తును గూబయ్యచేత తాగించి వాడు నిద్రలో పడ్డంతోనే తోలుతిత్తిలో దూర్చి ఆ కాకులకి వప్పగించాడు. కాకులు ఎత్తుకుపోయి, ముక్కులతో పొడుస్తోంటే గూబయ్యకి మెలకువ వచ్చి 'బాబోయ్!' అన్నాడు. కిందనుంచి విక్రముడు తన మాయగడ్డం, మీసం తీసి గూబయ్యమీద పడేటట్లు విసిరి, 'బాబోయ్ అమ్మోయ్ అంటూ ఆలస్యం చెయ్యక బంగారపు కణికలు ఎత్తి, కింద పొయ్యి' అని ఆజ్ఞాపించాడు.

గూబయ్య ఉక్కినపేసులా నోరెత్తక, విక్రముడు 'చాలు' అనేదాకా కణికలు ఎత్తిపోస్తూనేవున్నాడు. విక్రముడు తన దారిని పోబోతూంటే, పైనుంచి గూబయ్య, 'రక్షించు; రక్షించు' అని రోదనం చేశాడు. విక్రముడు, నిన్ను రక్షించటం నా తరం కాదు. ఇంతకీ నువ్వు కిందకు వచ్చి చేసేదేముందిలే. అక్కడే ఉండు రాజా!—నీకు కాకులచేత భోజనం పంపిస్తానులే. నాకు కావలసినప్పుడల్లా బంగారు కణికలు తవ్వి కింద పోద్దుగాని' అంటూ వెళ్లి, బాలామణిని చేరుకున్నాడు.



# చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

**అడ్డము:**

1. ఆకాశము
3. గోరువంక
5. ఒక తిథి
6. పట్టివి
7. అరుగు
9. సీత
11. ధనము
12. సంతోషము




**నిలువు:**

1. ఒక నది
2. ముసలితనము
3 రాత్రి
4. సన్నెకల్లు
7. ఎండాకాలము
8. పన్ను
9 శత్రుత్వము
10. మంచు

# వినోద చదరం

ఇచ్చిన ఆధారముల సహాయంతో ఈ క్రింది చదరంలో మీరు ఏడు మాటలు నింపాలి. సరియైన మాటలతో మీరు నింపగలిగితే అన్ని మాటలలోని చివరి అక్షరాలు ఒకేలా వస్తాయి. అంతే కాదు. ఈ ఏడు మాటలలోనూ వచ్చే రెండో అక్షరాలను వరుసగా పైనుంచి క్రిందికి కలిపి చదివినట్టయితే ఒక ముఖ్యమైన పండుగ పేరు వస్తుంది.




**ఆధారములు:**

1. కోతి
2. మేఘము
3. తామర
4. గుంపు
5. వేడుక
6. గాడిద
7. ఒక ఋతువు

మీకు తెలియకపోతే జవాబుకి 56-వ పేజీ చూడండి.






## రంగులు మారే బంతి

ఇంద్రజాలికుడు 'గుండ్రని ట్యూబ్' అమర్చిన 'నికెల్‌స్టాండ్' ఒకటీ, మామూలు తెల్లటి రబ్బరుబంతి ఒకటీ తీసుకువస్తాడు. ఆ బంతిని 'ట్యూబ్' పైన పెట్టి నొక్కి జారవిడిస్తే క్రిందికి వస్తుంది. ఇంద్రజాలికుడు ఆ బంతిని తీసుకుని ఈసారి దీన్ని పైనుంచి ఇలాగే వదిలి నీలపుబంతిగా చేస్తానని చెబుతాడు. అలా రెండో సారి ఆ తెల్లని బంతిని ట్యూబ్‌లోనుంచి జారవిడిస్తే క్రిందికి వచ్చేసరికి నిజంగా అది నీలపు బంతిగా మారి పోతుంది. ప్రేక్షకులు ఆశ్చర్యపోయి, 'ఏదీ—మళ్లీ ఆ బంతిని తెల్లటి బంతిగా చెయ్యి' అని కోరుతారు. ఇంద్ర జాలికుడు ఆ నీలపుబంతిని తీసుకుని ట్యూబ్‌పైనుంచి జారవిడిస్తే క్రిందికి వచ్చేసరికి తెల్లటి బంతిగా మారి పోతుంది. ప్రేక్షకులు నిజంగానే తెల్లబోతారు.

అసలు ఇందులో ఉన్న కిటుకు యిది—నిజానికి ఆ నికెల్ స్టాండ్‌లో కాని ట్యూబ్‌లో కాని ఇంద్రజాలం ఏమీలేదు. మొదట దాన్ని తయారుచేసుకునేటప్పుడే బంతికనుక ట్యూబ్‌పైనుంచి జారవిడిస్తే క్రిందికి వచ్చే పరిమాణంలో తయారు చేయించుకోవాలి. అయితే మళ్లీ ఛర్రున జారిపోయేట్లుగాకూడా ఉండ కూడదు. అలా అయితే మళ్లీ యిబ్బంది. కొంచెం బిగుతుగా—అవసరమయితే మధ్యలోనే బంతి ఆగి పోయేట్లుగా తయారు చేయించాలి. ఈ ట్రిక్కులో ఉన్న కిటుకల్లా యిదే.

ఇంద్రజాలికుడు ప్రేక్షకులకు చూపే బంతి ఒకటే. కాని నిజానికి యిందులో ఉపయోగించబడేవి మూడు





బంతులు. రెండు తెల్లటివి – ఒక నీలపు బంతిన్నీ. ఈ ప్రక్క బొమ్మలో చూస్తే అది సులభంగా తెలిసిపోతుంది.

ఇంద్రజాలికుడు మొదట్లో, ఆ నికెల్ ట్యూబ్‌లో అడుగున ఒక తెల్లబంతినీ, దానిమీద ఒక నీలపు బంతినీ అమర్చి ఉంచుకోవాలి. 'ఇదుగో ఈ ట్యూబ్‌లో ఏమిలేదు' అనిచెపుతూ పైనుంచి ఆ తెల్లబంతిని కొంచెం నొక్కి జారవిడుస్తాడు. కాని ఆ బంతి ఆ ట్యూబ్‌లోనే ఉండిపోతుంది. ఆ ఒత్తిడికి అడుగున ఉన్న తెల్లబంతి క్రిందికి వస్తుంది. ఇంద్రజాలికుడు మొదట చూపిన బంతే క్రిందికి వచ్చిందనుకుంటారు ప్రేక్షకులు.

ఈసారి నీలపుబంతి అడుగుకు వస్తుందిగా! 'ఈ తెల్లబంతిని నీలపుబంతిగా మారుస్తా, చూసుకోండి!' అంటూ ట్యూబ్‌లో బంతిపెట్టినొక్కి జారవిడుస్తాడు. ఇప్పుడు అడుగున ఉన్న నీలపుబంతి మాత్రం క్రిందికి వస్తుంది. అనగా, తెల్ల బంతులు రెండూ ట్యూబ్‌లోనే ఉండిపోతాయి. ఇహ మిగిలినదంతా సులభమేగా?

కాని ఒక్క సంగతిమాత్రం గుర్తుంచుకోండి. ఈ ఇంద్రజాలం ప్రేక్షకులకు ఒక్కసారికన్న యెక్కువసార్లు చేసి చూపకూడదు. చాలా బావుంది మళ్ళీ చెయ్యమని వాళ్లు కోరినాసరే, ఇంద్రజాలికుడు ఉబ్బిపోకూడదు. రెండోసారి చేసి చూపకుండా ఉండటమే శ్రేయస్కరం.





పాఠకులు ఈ గారడిని గురించి యింకా వివరంగా తెలుసుకోదలిచితే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి నేరుగా వ్రాయవచ్చు. మీరురాసే ఉత్తరాలు ఇంగ్లీషులోనే వుండాలి. ఇది అతి ముఖ్యం.

ప్రొఫెసరుగారి అడ్రసు యిది:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్,

12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్,

కలకత్తా - 19.

# రంగు వెయ్యండి—5-వ బొమ్మ కథ

ఎంతో ప్రయాసపడిన మీదట ఆ చెట్టుకు చుట్టకొనివున్న సర్పాన్ని ఎలాగో సంహరించగలిగాడు రాకుమారుడు. చెట్టుపైకి ఎగబ్రాకసాగాడు. ఐతే, ఇంతా కష్టపడి చెట్టుపైకి చేరుకునేసరికి ఆ పంచవన్నెల చిలుక కాస్తా తుర్రుమని ఎగిరిపోదుకదా అని మనసులో ఆందోళనగానే వున్నది. కాని చిత్రం! చిలుక కదలలేదు మెదలలేదు. రాకుమారుడు ఉప్పొంగిపోతూ చిలుకను పట్టివేశాడు. దానిని జేబులో భద్రపరచుకొని తిరుగుముఖం పట్టాడు. మరికొద్దిరోజులకల్లా మహలు చేరుకున్నాడు. మహానుభావుడు మౌనంలో వున్నాడు. రాకుమారుడు తన జేబులోని చిలుకని తీసి మహానుభావుడి ముందు వుంచాడు. కాని వింత! పంచవన్నెల చిలుకకు బదులు ఎర్రటిచిలుక కనుపించింది. ఇది చూచి రాకుమారుడు నిలువునా నీరైపోయాడు. తెల్లవారింది. మహానుభావుడు మౌనం చాలించాడు. ఎర్రచిలుక మళ్లీ పంచవన్నెల చిలుకగా మారింది. ఇది చూచి రాకుమారుడు ఉప్పొంగిపోయాడు. మహానుభావుడు రాకుమారుడి వెన్నుతట్టుతూ 'నిన్న ఈ చిలుక ఎర్రగా ఉండటం చూచి గాభరా పడిపోయావ్ కదూ? దీని రహస్యం విను: ఒక్క అమావాస్యనాడే ఈ చిలుక పంచ రంగులు ధరిస్తుంది. మిగతా రోజుల్లో రోజుకొక రంగుగా మారుతూవుంటుంది. మొత్తానికి సాధించుకు వచ్చావ్! చాలా సంతోషం. అయితే మరొక్క షరతు వున్నది. నీకు బిడ్డ పుట్టిన మరుక్షణం, నీవుకానీ ఆ బిడ్డకానీ నా దేవికి బలి కావాలి. సిద్ధపడితే మీ రాకుమార్తెకు మామూలు స్వరూపం వచ్చేమార్గం చెబుతాను' అన్నాడు. ఇది విన్న రాకుమారుడు విస్తుపోయాడు. జవాబు చెప్పితీరాలె, తప్పదు. అందుకని 'సరే, ఏదో ఒకటి చేస్తాను' అని అప్పటిమట్టుకు చెప్పి తప్పించుకున్నాడు.

మహానుభావుడు ఆ పంచవన్నెల చిలుకనుండి ఈక ఒకటి తీసి రాకుమారుడికిచ్చాడు. "దీనిని వెలిగించి, ఆ పొగని చిలుకరూపంలో వున్న మీ రాకుమార్తెకు సోకనియ్యి, వెళ్లు. వాగ్దానం మాత్రం మరిచిపోకు!" అంటూ చెప్పి సాగనంపాడు.

రాకుమారుడు యిల్లు చేరుకున్నాడు. చిలుకకు ధూపం వెయ్యటానికి ఏర్పాట్లు జరిగినై. మహానుభావుడు ఏర్పరచిన షరతుని రాకుమారుడు ఆస్థానవిద్వాంసుడికి ఒక్కడికే చెప్పాడు. అందుచేత సంతోషానికి బదులు ఆయనకు విచారమే కలిగింది. ఇది తెలియని రాజూ, రాణి మాత్రం ఆనందంలో మునిగిపోయారు.

# అట్టమీది బొమ్మ

దుష్టరాక్షసుడైన నరకుణ్ణి హతమార్చివేశాడుకద శ్రీకృష్ణుడు. ఆ తరవాత పరమాత్ముడు పదహారువేలమంది గోపికలను ఒక్కసారిగా పెళ్లాడినాడట!— ఎంత వింత!! ఎటువంటి విడ్డూరం!!! ఈ వార్త చెవినిపడగానె, చిత్రమేమిటో చూచివద్దామని త్రిలోకసంచారి ఐన నారదమహర్షికి కుతూహలం కలిగింది. వెంటనే ఆయన బయల్దేరి వెళ్లి అతివైభవంతో ప్రకాశిస్తూవుండే ద్వారకాపురి చేరుకొన్నాడు. సంతోషాంతరంగులైవున్న రుక్మిణీ కృష్ణులను సందర్శించాడు.

కృష్ణుడు దిగ్గునలేచి, మహర్షికి అర్ఘ్యపాద్యాదులిచ్చి సత్కరించాడు. కుశలప్రశ్నలైనతరువాత నారదుడు 'ఓ సర్వలోకనాయకా! లోకక్షేమంకోసమని నీవు అవతారమెత్తుతావన్న సంగతి నాకు ముందే తెలుసు. సంసార కూపంలో పడిపోయినవారికి పట్టుకొమ్మవై ముక్తినిచ్చే నీ పాదయుగమే నాకు లభించింది. ఇంతకంటె ఏం కావాలె!' అని స్తుతించి, సెలవు తీసుకుని ఒక గోపిక యింటికి వెళ్లాడు. అక్కడ గోపికతో ముచ్చటిస్తూ, తాంబూలచర్వణం చేస్తూవున్న కృష్ణుడు లేచివచ్చి మహర్షికి అర్ఘ్యపాద్యాదులిచ్చాడు.

నారదుడు అమితాశ్చర్యం పొందాడు. తనివితీరక, పడివడిగ గోపికల గృహాలు ఇంకా చూడాలనుకున్నాడు. ఒక గోపిక యింట్లో గానలోలుడైన మురళీకృష్ణుడు దర్శనమిచ్చాడు మహర్షికి. మరొక ఇంట్లో బిడ్డలనెత్తుకుని ముద్దాడుతున్న ప్రేమమూర్తి కృష్ణుడు అగుపించాడు. ఇంకొక గృహానికి పోగా ఉద్ధవునితో పాచికలాడుతూ క్రీడాసక్తుడైన శ్రీకృష్ణుడు కనబడ్డాడు. మరొకచోట తీర్పులు తీరుస్తున్న న్యాయాధిపతి కృష్ణుని సందర్శనం లభించింది. ఇంకొక యింటిలో బ్రాహ్మణోత్తములకు మృష్టాన్నములు వడ్డిస్తున్న లీలామానుష విగ్రహుడైన కృష్ణుడు అగుపించాడు.

ఏకకాలమందే ఇన్నిరూపులతో ప్రత్యక్షమైన ఆ పరమాత్మునికి నమస్కరించి, "దేవాదిదేవా!—నీ యోగమాయావిలాసాన్ని కనుక్కోవటం ఎవళ్లతరమూ కాదు. నీ పాదపరిచర్యా మహిమవల్ల నేనొక్కడినే తెలుసుకోగలిగాను. పరమపావనమైన ఈ నీ లీలలు పాడుకొంటూ లోకాలు సంచరించుకపోతాను. అనుజ్ఞ ఇవ్వు" అంటూ, గోవిందుని సెలవు తీసికొని ఆనందంతో మరలిపోయాడు నారదుడు.

# దీపావళి

"మహేశ్వర్" (మద్రాసు)



మజా మజా దీపావళి
బలే బలే దీపావళి
మతాబీల దీపావళి
రంగు రంగుల దీపావళి

ధనకిధనా తాటాకులు
గభాగుభీ పటాకీలు
ఢాం - ఢాం - పటాసులూ
టపటపాల చిటపటాలు
బలే బలే దీపావళి

కన్ను బుస్సు తాతవలే
చిర్రుమంటు లేచింది
చుంచెలకామూతివంటి
చిన్నదైనా చిచ్చుబుడ్డి
దాని హొరు దాని జోరు
ఇంటిచూరు దాటింది.

టెలిగ్రాపు తీగ తన్ని
పైకి పైకి పోవాలని
పోతుంటే పొట్టపేలి
తుస్సుమని కూలిపోయె
అయ్యోయ్యో చిచ్చుబుడ్డి
మజా మజా దీపావళి.

గిరగిర తిరిగే చక్రం
ధగధగలాడే పువ్వులు
జిగజిగలాడే రవ్వలు
హాయి హాయి దీపావళి!

కాయలంటె కాయలోయ్
సీమటపా కాయలోయ్
తుళ్లి తుళ్లి పేలి పేలి
దీపాలార్పిం చేస్తాయోయ్
చూడ చిక్కలి చిన్నవీ
సందడిలో పెద్దవీ!
బలే బలే దీపావళి!

దీపావళి సామానులు
అనుకున్నవి కొనకుంటే
పాపాయిల కోపావళి
దీపావళి దీపావళి.

అగ్గిమీద గుగ్గిలాలు
భగ్గు భగ్గుమంటు లేచె
దుబ్బు దుబ్బు దీపావళి
మజా మజా దీపావళి.

# ఒంటిగీత బొమ్మ



పంపినవారు : టి. వి. రంగస్వామి, ఆరణి

### 49 - పేజీలోని వినోద చదరానికి

జవాబు :

| | | | | |
|---|---|---|---|---|
| 1 | వా | స | ర | ము |
| 2 | నీ | ర | ద | ము |
| 3 | పం | క | జ | ము |
| 4 | ని | చ | య | ము |
| 5 | కౌ | తు | క | ము |
| 6 | గా | ర్ద | భ | ము |
| 7 | శి | శి | ర | ము |

### 49-వ పేజీలోని

ఫజిలుకి జవాబు :

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 న | భ | 2 ము | | 3 శా | రి | 4 క |
| ర్మ | | ది | | ర్వ | | ల్వ |
| 5 ద | శ | మి | | 6 రి | క్త | ము |
| | | | | | | |
| 7 వే | ది | 8 క | | 9 వై | దే | 10 హి |
| స | | ప్ప | | ర | | మ |
| 11 వి | త్త | ము | | 12 ము | ద | ము |

Controlling Editor : SRI CHAKRAPANI

Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras - 1

